JAGATI | Rs. 2-00 | October, 1991

36th Year of Publication




## అక్టోబరు - 1991

## సాహితీ సుధ

గంగా ధౌత శిలాతలంబు హర గోస్కంధ ప్రదేశాహ తో
త్తుంగ క్ష్మాజము సిద్ధ సేవిత గుహాస్తోమంబు శీతాచలో
స్వంగం బుండగ నెవ్వడోపు నృపపాదంబుల్ దలం దాల్ప
రంగీ శాబవిలోచనల్ మనసిజాస్త్రంబుల్ సతుల్ లేనిచోన్

—భర్తృహరి

కోతికి శక్యమా యసుర కోట్లను గెల్వగ గెల్చెబో నిజం
బాతని మేన శీతకరుడౌట దవానలుం డెట్టి వింత మా
సీత పతివ్రతా మహిమ సేవకు భాగ్యము మీ కటాక్షమున్
ధాతకు శాక్యమా పొగడ దాశరథీ కరుణా పయోనిధీ

—దాశరథీ శతకం

కనగ సొమ్ములెన్నొ కనకంబునొక్కటే - పసుల వన్నెలెన్నొ పాలునొకటి
పుష్ప జాతులెన్నొ పూజయొక్కటె సుమా - విశ్వదాభి రామ వినురవేమ

—వేమన

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి.బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 50-00 - 4 సం॥లకు రు. 100-00 - జీవిత
చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలలో పాట్రన్ రు. 2000-00

ముఖచిత్రం : రాజీవ్ గాంధీ (అగస్టు - 26....'సద్భావన దినం')

# నిమ్మతో నవ్వులు

❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀

వాసంతి, జయంతిని క్రితం రోజు సాయంత్రం మార్కెట్లో చూసింది. కాలేజి రోజుల్లోని ఫ్రెండ్సిద్దరూ ఒకరి నొకరు పల్కరించుకున్నారు. జయంతి భర్తకు ఈ మధ్యనే యిక్కడకు ట్రాన్స్ఫరయింది.

వాసంతి ఫ్లాట్లో, సాదాసీదా కబుర్లయాక, భర్తల గురించి వచ్చింది.

'జయంతీ, నువ్వు నమ్ముతావో లేదోగాని మా వారికీ నేనంటే ఎంత ప్రేమో చెప్పలేను. ఒక్కక్షణం విడిచి పెట్టి వుండలేరు. నేనెక్కడికి వెళ్లినా, నా వెంట వుండవల్సిందే'

'మా వారు అంత అనుమానం మనిషికాదు, వాసంతీ,' - అంది

—పియమ్ సుందర్రావు
విజయవాడ-8

సుగుణ పిన్నీ నువ్వు అర్జంటుగా ఒక పాట పాడాలి - అన్నాడు శంకరం.

'అదేమిటిరా, పాట పాడేందుకు మూడ్ రావాలి' - అంది సుగుణ, శంకరాన్ని గద్దిస్తూ.

'పిన్నీ, నా అవస్థ తెలుసుకో లేకుండా వున్నావ్?'

'ఏమిట్రా నీ అవస్థ?' - అంది సుగుణ నవ్వుతూ.

'అమ్మ సినిమాకి వెళ్లింది. ఈ బుజ్జి గాడు ఏడుపు మానడంలేదు. వెనకొక సారి బాబాయి చెప్పాడు: బుజ్జిగాడు మరీ ఏడిస్తే మీ సుగుణ పిన్నిని పాట పాడమను. వెంటనే గాడిద వస్తుంది - దాన్ని చూస్తూ వీడు ఏడుపు మానే స్తాడని'

—జి సుబ్రహ్మణ్యశర్మ
అమలాపురం

ప్రఖ్యాత సినీతార మనోహరిని ఒక జర్నలిస్ట్ ఇంటర్వ్యూ చేస్తున్నాడు.

'మీకు తెలుగు పుస్తకాలంటే యిష్టమా, యింగ్లీషు పుస్తకాలంటే యిష్టమా?'

'ఏవీ చదవను.'

'తెలుగు సినిమాలు ఎక్కువగా చూస్తారా, హిందీవా, ఇంగ్లీషువా?'

'ఏవీ చూడను'

'పొద్దుటే తెలుగు దినపత్రిక చూస్తారా, ఆంగ్ల దినపత్రిక చూస్తారా?'

'నాకు టైమెక్కడ?'

'కథల వారపత్రికలు చదువు తారా?'

'ఏవీ చదవనని చెప్పాను కదండీ'

'మరి, ప్రపంచం గురించి ఎలా తెలుస్తుంది ?'

'ఎందుకు తెలియాలి ?'

—ఆర్ జయరావు
కాకినాడ-3

బాగా పేరుబడ్డ రచయిత్రికి యిల్లు అద్దెకి కావల్సి వచ్చింది.

ఇంటి యజమాని పోర్షనంతా చూపించాడు. పనిమనిషికి తడుముకో నక్కర్లేదనీ పేపరు కుర్రాడే పాల బాగ్ కూడా తెచ్చిపెడతాడనీ ఉదయం ఒక గంట సేపు నీళ్లు వస్తాయనీ, కరెంట్‌కి వేరే మీటరు వుందనీ యిలాటి సదుపాయాలన్నీ చెపి, ఆరు నెలల అద్దె అడ్వాన్సుగా కావాలన్నాడు.

'ఈ యింటి చుట్టుపట్ల చెత్తకాగితాల షాపు లేకుండా వుంటే చాలు - మీరు కోరిన అడ్వాన్స్ యిప్పుడే యిచ్చేస్తాను' - అన్నదామె.

—కె రామకృష్ణ
రేపల్లె

మహిళా మండలి సెక్రటరీ కాంతామణి, తన కొడుక్కి పెళ్లికానంత వరకూ, ఏ మీటింగ్‌కి వెళ్లినా, అత్తా కోడళ్ల ప్రస్తావన తెచ్చి, అత్తగారు కోడలిని ఎలా చూసుకోవాలో చెప్పేది.

కొడుక్కి పెళ్లయాక ఏ మీటింగ్‌కి వెళ్లినా, కోడలు అత్తగారిని ఎలా చూసుకోవాలో చెప్పడం ప్రారంభించింది.

మహిళా మండలి సభ్యురాలు పార్వతి ఒక రోజున తెగించి అడిగింది : 'ఏమండీ కాంతామణిగారూ, మీ అబ్బాయికి పెళ్లికానంత వరకూ, అత్తగారు కోడల్ని ఎలా చూసుకోవాలో చెప్పారు. ఇప్పుడు కోడలు అత్తగారిని ఎలా చూసుకోవాలో చెబుతున్నారు. ఇంతకీ మీ ఉద్దేశ్యం ఏమిటో నాకు అర్థం కావడం లేదు'

'పార్వతిగారూ, ఇందులో అర్థంగాని దేముంది ? అప్పుడు నేనూ ఒక కోడల్ని గనుక అలా చెప్పాను. ఇప్పుడు అత్తగారినయాను గనుక యిలా చెబుతున్నాను' - అన్నది కాంతామణి.

—యస్‌టిపి శ్రీదేవి
విజయవాడ-13







# పాఠకులేఖలు

శ్రీయుత చందూర్‌గార్కి ; ఉన్నవ వారి ముఖచిత్రం (జులై సంచిక) చాలా ఆనందం కలిగించింది. ఆయన సాహిత్యం గురించి తెలుసుకున్నామే గాని ఛాయాచిత్రం యింతదాకా చూడ లేదు - మీ పత్రిక ద్వారా చూడడం జరిగింది.

—మల్లిబాబు
దుమ్ముగూడెం

ప్రియ స్నేహితులు చందూర్ దంపతులకు : ఆఫ్రికా అంప, వాళ్ల షిప్‌కి తగలగానే, 'పుట్టిల్లు' అంటూ వచ్చేసింది మా అమ్మాయి.... ఉగాది పండగ మేమిక్కడ ఒక ఉత్సవంలా చేసుకున్నాము. కృష్ణశాస్త్రి గారి వసంతలక్ష్మి, వెన్నెలపాట, అభినయం, డాన్సులు - ఎంతో సరదాగా గడిచింది. వేపపువ్వు, కొత్త చింత పండు దొరకదు గాని ముందే జాగ్రత్త పడ్డాము. మద్రాసు నుంచి వస్తున్నప్పుడు మోహన్ పంచాంగం తెచ్చారు. పంచాంగ శ్రవణంతో ప్రారంభించి, వినోద కార్యక్రమంతో ముగింపు - ఇంట్లో చేసిన వంట కాలతో విందు. ఈ మధ్య ఒకేసారి పోసులో మూడు 'జగతు'లు వచ్చాయి - మద్రాసు కబుర్లు మాకు తెలిపేది 'జగతే' కద !

—వాణీ మోహన్
గబరోనె - బొట్స్‌వానా

ప్రియ మిత్రులు శ్రీ చందూర్ గారికి నమస్కారములు. ఉభయ కుశలోపరి.... 'నా చిన్ననాటి ముచ్చట్లు' తెలుగు సాహిత్యానికే ఎనలేని శోభ కలిగించే అలంకారం. అచిరకాలంలోనే పుస్తక రూపంలో వస్తుందని తెలుసుకున్న తర్వాత ఏనుగెక్కినంత సంతోషం కలిగింది. - ఆనందంతోపాటు అశ్రువులూ నా కళ్లలో మిగిలాయి. 'ఎన్నిబాధలు పడితివో చిన్ననాడు - నయనములు కాల్వలయ్యె. హృదయము వికల - మయ్యె వైరికైన వలదు అట్టి వెతలు - నీవు నరకేసరివి ! యిది నిజము సౌమ్య' - అని వ్రాసుకున్నాను, ఒక పుస్తకంలో.... పరిశోధకులు భద్ర పరుచుకోవలసిన వ్యాసం 'కొన్ని జ్ఞాపకాలు'. ఎన్ని విషయాలో I wish to be forgotten అని ఉన్నవవారన్నట్లుగానే ఆయన విస్మృత రచయిత అయ్యారు.

— చల్లా రాధాకృష్ణశర్మ
మధుర - 20

# వెన్నెల కెరటాలు

## 'భక్త చింతామణి'

చింతామణి రత్నము పాల సముద్రమున ప్రభవించిన మణి. స్మరణ మాత్రమున యభీష్టమున దీర్చ గలదు. అటులే భగవానుడును గోరిక లను దీర్చుగాకయని కవి సార్థకముగా 'భక్త చింతామణి'యని సంఘటించి నాడు. శతకమునకు సాధారణముగా నూటెనిమిది పద్యములు వ్రాయుట పరిపాటి. కాని, యీ కవి మూడువం దల ఏబదికి పైబడి పద్యములు వ్రాసి నాడు. ఇది రెండు భాగములుగా నున్నది. 121 పద్యము నుండి ఉత్తర శతకముపేర నున్నది. ఇదియు శ్రీ కారము తోడ ప్రారంభింప బడినది. భగవన్మహిమ వర్ణనము, సానుతాప ప్రార్థన, ఉపకార స్మృతి మొదలగు శీర్షికలతో దీనియందున పద్యములు గలవు. తక్కిన శతకము లందు వలె తమ యిష్టదేవతల స్వరూప లీలా మహాత్మ్యాది వర్ణనలీ శతకమున లేవు. కవి వైయక్తికాభి ప్రాయములను, తమ వేదనను, ఆకాంక్షలను, భగవానుని యెదుట ప్రదర్శించుకొనినాడు.

—గురజాడ హనుమంతరావు
'స్రవంతి'లో

## 'మొగలి రేకులు'

నేను 1951 సెప్టెంబరు 6వ తేదీన వాహినీ సంస్థలో చేరాను, "ఎక్స్‌క్లూసివ్" రైటర్‌గా! అంటే, ఆ పిక్చర్ విడుదల అయ్యేవరకూ యింకే కంపెనీకి పనిచేయగూడదు. నెలకు మూడు వందల రూపాయల జీతం. అది కాక పిక్చర్ మొత్తం మీద - వేరే-రెండువేలరూపాయలు! అంతకు ముందు - వాహినీ సంస్థకు, కె. వి. రెడ్డిగారు తీసిన 'గుణసుందరికథ'కి రచయితగా పని చేసిన పింగళి నాగేంద్రరావుగారికి గూడ - యివే 'టరమ్స్'ట! కాకపోతే - ఆయన పాటలు గూడ వ్రాశారు గనక - దానికి ప్రత్యేకంగా యిచ్చారట! నా మొదటి చిత్రం 'పెద్దమనుషులు'-అది కె.వి. రెడ్డిగారికి - మొదటి సాంఘిక చిత్రం! అంతకు ముందు ఆయన నాలుగు చిత్రాలు తీశారు - భక్త పోతన యోగివేమన - రెండూ జీవిత చరిత్రలు. ఆ తరువాత 'గుణసుందరి కథ' - పాతాళభైరవి, రెండూ జానపదలు! ఆ తరువాత - ఒక మంచి సాంఘిక చిత్రం.

—డివి నరసరాజు
'విజయచిత్ర'లో

# పాతికేళ్ల నాటి పిక్చర్



*లెస్టర్ జేమ్స్ పెరీస్*

## 'డెలవాక్ అథారా'

చిన్న దేశమైన సిలోన్ నుంచి జేమ్స్ పెరీస్ వంటి గొప్ప దర్శకులు ప్రపంచ సినిమాను ఆకట్టుకుంటున్నారు. రెండు సంవత్సరాల క్రితం 'గామ్ పెరాలియా' అంతర్జాతీయ గుర్తింపు పొందింది. అల్బారీగా (హంగెరి) నైఫ్ ఇన్ ది వాటర్ (పోలండ్), డెలింక్వెంట్స్ (ఫ్రాన్సు) వంటి చిత్రాలు ఫెస్టివల్స్‌లో తప్ప చూడలేము.... ఈ 'డెలవాక్ అథారా' ఒక భాగ్యవంతుని ఏకైక తనయుని కథ. పాతికేళ్ల పైబడ్డ ఈ ధనిక యువకుడు, నిశ్శంక విజయ సింగ్, తండ్రికి బిజినెస్‌లో సాయ పడుతూ వుంటాడు. రెండు కుటుంబాలకు అంగీకరమైన షిరాని గుణశేఖరితో వివాహం కావల్సివుంది. ఇద్దరూ అన్యోన్యంగా తిరుగుతూంటారు గాని ఒక రోజున డిన్నర్ పార్టీకి గుణశేఖరిని తన వెంట తీసుకు వెళ్తానంటే ఆ అమ్మాయి పెద్దలు 'పెళ్లికానిదే అలా వెళ్లడం బావుండదని' అభ్యంతరం తెలుపుతారు. అతనికేమంత కోపం రాదుగాని ఆరోజు డిన్నర్ పార్టీలో, తనతో కాలేజీలో చదవుకు, ప్రస్తుతం లెక్చరరుగా పనిచేస్తున్న చిత్రా కరుణరత్న తటస్థపడుతుంది. పార్టీ ముగిసి, ఆమెని యింటి వద్ద డ్రాప్ చెయడానికి వెళ్తూండగా, వాన చినుకులు కుండపోత అవుతాయి. రోడ్డు మలుపులో ఒక మనిషి కారు కింద పడతాడు. అర్థరాత్రి. నిర్జన ప్రదేశం. కుంభవృష్టి. ఆ మనిషిని కారులో వేసుకు హాస్పిటల్‌కి తీసుకు వెళ్దామంటుంది కరుణరత్న. ఆ సమయంలో తామిద్దరినీ ఎవరైనా చూస్తే, తన భావిజీవితపు కలలు భగ్నమంటాయనుకొనే ఆ ధనికయువకుని భీరుత్వానికి ఖేదపడి కారులోకి వచ్చి కూచుంటుందామె. కర్తవ్యం నుంచి పారిపోయిన విజయ సింగ్‌ని పెనుభూతంలాటి నీడమాత్రం వొదలదు. 'నిజం వొప్పుకుంటే గాని నీకు మనశ్శాంతి వుండదు' - అని చెబుతుందామె. కారు కింద పడి చనిపోయినతను యిద్దరు పిల్లల తండ్రి. పోలీసువారికి కారు నెంబరు తెలుస్తుంది. అంతా సర్దుబాటు చేసేందుకు పెద్దలు, ఇంటి నౌకరుతో బేరం కుదుర్చుకు చనిపోయినతని కుటుంబానికి ద్రవ్యం ముట్టచెబుతారు. అయితే, మనశ్శాంతిలేక కరుణరత్న వద్దకు వెళ్తాడు. పోలీసుస్టేషన్‌కి అతనిని తన వెంటబెట్టుకు తీసుకువెళ్లే కరుణరత్న ఒక దయారూపిణి, శక్తిరూపిణి.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - అక్టోబరు 1966

## మానవ ప్రగతి

### 'అట్లాంటిస్'

అంతరిక్ష పరిశోధనల చరిత్రలో ఏప్రిల్ మాసానికి ఒక ప్రత్యేకస్థానం వున్నది. వ్యోమ పరిశోధనల రంగంలో అద్భుతమైన మార్పులకు దోహదం చేసిన అమెరికన్ రోదసీ విమానం (స్పేస్ షటిల్) తొలియాత్ర సరిగా పదేళ్లకు పూర్వం ఏప్రిల్ నెలలో, 12వ తేదీన జరిగింది. కాగా .... స్పేస్ షటిల్ ప్రయోగాలలో ఒక ఫలప్రదమైన దశాబ్దం పూర్తయిన సందర్భంగా అమెరికన్ రోదసీ విమానం 'అట్లాంటిస్' ఇటీవల తన ఆరు రోజుల అంతరిక్ష యాత్రను విజయవంతంగా ముగించుకుని భూమికి తిరిగి వచ్చింది. ఈ సందర్భంగా 'అట్లాంటిస్'లోని అయిదుగురు వ్యోమగాములు (ఒక మహిళా వ్యోమగామితో సహా) ఒక 'గామా కిరణ వేధశాల'ను రోదసీలో ప్రవేశపెట్టడంతో పాటు రెండుసార్లు 'అంతరిక్షంలో నడక'ను కూడా విజయవంతంగా నిర్వహించారు. అమెరికన్ అంతరిక్ష విమాన ప్రయోగాల పరంపరలో ఈ 'అట్లాంటిస్ యాత్ర' 39వది. ఈ యాత్ర సందర్భంగా 'గామా కిరణ వేధశాల' లోని ఒక 'యాంటెనా' తెరుచుకొనక పోవడంతో వ్యోమగాము లిద్దరు షటిల్ నుంచి బయటకెళ్ళి.... రోదసిలో నడుస్తూ 'యాంటెనా'ని సరి చేశారు. ఇది అప్పటికప్పుడు నిర్ణయించుకుని రోదసిలో సాగించిన నడక కావడమే విశేషం. ఆ తర్వాత రెండవ దఫా వ్యోమగాములు అంతరిక్షంలో మరోసారి నడిచి అమెరికా నిర్మించదలచిన స్పేస్‌స్టేషన్ పరికరాలను ఆరుగంటలపాటు పరీక్షించారు. వాస్తవానికి 'అట్లాంటిస్' యాత్ర అయిదు రోజులపాటు మాత్రమే జరగాలని తొలుత నిర్ణయించారు. అయితే కాలిఫోర్నియాలోని ఎడ్వర్డ్స్ ఎయిర్ ఫోర్స్ బేస్ వద్ద షటిల్ భూమికి దిగవలసి ఉన్న ప్రాంతంలో, వాతావరణం అనుకూలంగా లేనందున 'అట్లాంటిస్' భూమికి దిగడంలో ఒక రోజు ఆలస్యం జరిగింది.

(అమెరికా సమాచార శాఖ

## 'జావా మనిషి'

వానరునికీ జావామనిషి నరునికీ మధ్యనున్న లింక్ వొకటి, చాలా కాలం వరకూ దొరకలేదు. జీవపరిణామం గొలుసులో దీన్నే - మిస్సింగ్ లింక్ - అని పిలుస్తారు. వానరునికీ నరునికీ మధ్యనుండ వలసినవాడు - నరవానరుడు. ఈతని అవశేషాల కోసం డచ్ శాస్త్రవేత్తయైన యూజీన్ దుబేయ్ జావా -బోర్నియోలలో వెదక నారంభించాడు. 1891లో జావాలోని ట్రినిల్ వొద్ద, ఒక అపూర్వమైన పుర్రె, దంతాలూ లభించాయి. వాటిలో మానవ లక్షణాలు స్పష్టంగా వున్నా, వానర లక్షణాలు కూడా కన్పించాయి. దుబోయ్ వీటిని సంపాయించిన తర్వాత ఇతర శాస్త్రజ్ఞులు జావా మనిషికి చెందిన ఎముకలు గూడా సంపాదించారు. వానరునికీ, నరునికీ, నర వానరునికీ చెందిన పుర్రెల్లోని దవడలూ దంతాలూ సుదురూ పరిశీలించి నట్లయితే, ఈ జావా నరవానరుడు, వానరులకూ నరునకూ మధ్యగా వున్న విషయం స్పష్టమైంది. దుబోయ్ సంపాదించిన ఈ నరవానరుడు దాదాపు పదిలక్షల సంవత్సరాల క్రితం నాటి వాడని శాస్త్రవేత్తలు అంచనా కట్టారు. (అమ్మాజీ సర్కార్ - ఆల్‌హస్నా.

## 'జున్ను'

జున్ను తినడంవల్ల దంతక్షయం జరగకుండా వుండడమేకాక తొలి దశలో వున్న దంతక్షయం తొలగిపోతుందని అల్బర్టా యూనివర్శిటీకి చెందిన డాక్టర్ ఆంథొనీ హార్‌గ్రీవ్స్ అనే దంత పరిశోధకుడు వెల్లడించారు. సుమారు 100 మంది పైన రెండేళ్లపాటు పరిశోధనలు జరిపిన అనంతరం డాక్టర్ హార్‌గ్రీవ్స్ ఒక ప్రకటన చేస్తూ.... జున్ను తినేటప్పుడు విడుదలయిన కాల్షియం దంత క్షయాన్ని నివారిస్తుందని; దంతాల లోని చెడిపోయిన భాగాలలో.... జున్ను తినడంవల్ల ఆరోగ్యవంతమైన, క్రొత్త ఖనిజలవణాలు ఏర్పడతాయని పేర్కొన్నారు. సూర్యరశ్మికి పళ్ల ఆరోగ్యానికి మధ్యగల అవినాభావ సంబంధం గురించి కూడా డాక్టర్ హార్‌గ్రీవ్స్ పరిశోధన జరిపారు. కృత్రిమంగా కల్పించిన వెలుతురు గల తరగతి గదులలో చదివే విద్యార్థులకంటె సహజ కాంతిలో చదివే విద్యార్థులలో దంతాలకు సంబంధించిన సమస్యలు తక్కువగా వున్నట్లు ఆయన కనుగొన్నారు.
(అమెరికా సమాచార శాఖ

❀

❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀

పిల్లి, ఎలక ఒక వొప్పందానికి వస్తే నష్టపోయేది వర్తకుడు.

— పెర్షియన్ సామెత

సిరిసంపదలను సృష్టించకుండా వినియోగించగల హక్కు ఎలా లేదో, సుఖ సంతోషాలు విషయమూ అంతే.

— బెర్నార్డ్ షా

❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀❀

# కొత్త పుస్తకాలు

భారతరత్న మోక్షగుండం విశ్వేశ్వరయ్య - జీవితకథ. రచన: జానమద్ది హనుమచ్ఛాస్త్రి - ప్రచురణ: జె నాగరాజ్, సాహితీ బుక్స్, రైల్వే స్టేషన్ రోడ్, కడప-4.... వెల: రు. 15-00.

1861 లో భారత జాతికి మణిదీపాలనదగు నలుగురు మహనీయులు జన్మించారు. మోతీలాల్ నెహ్రూ, మదనమోహన్ మాలవ్యా, రవీంద్రనాథ్ టాగూర్, మోక్షగుండం విశ్వేశ్వరయ్య. మైసూర్ సంస్థానం కోలారు జిల్లా చిక్క బళ్లాపుర తాలూకాలోని ముద్దేనహళ్లిలో జన్మించిన విశ్వేశ్వరయ్య, మెట్రిక్యులేషన్ పరీక్ష ఫీజు పన్నెండు రూపాయిలు కోసం 35 మైళ్లు కాలినడకను, తల్లిగారు వున్న ఊరు వెళ్లవలసి వచ్చింది - ఆమె తన వద్ద వున్న రాగి హండా తాకట్టు పెట్టి ఆ డబ్బు యిచ్చింది.

క్రమ శిక్షణకు మారుపేరు విశ్వేశ్వరయ్య. 'సైఫన్' పద్ధతిని పంజ్రా నదీ జలాలను ప్రవహింపజేయడం ఆయన ప్రథమ విజయం. 'స్వచ్ఛంద కవాట నిర్మాణం' అనే యింజనీరింగ్ ప్రక్రియను 'పేటెంట్' చేసి, కోటీశ్వరుడవగల అవకాశం ఉన్నప్పటికీ నిరాకరిస్తూ, యిది ప్రజోపయోగం కోసంగాని స్వంత లాభానికి కాదు - అన్నారాయన.

సూయజ్ కాలువ ముఖద్వారం వద్ద వున్న ఏడెన్ నగరం, అప్పట్లో బొంబయి రాష్ట్రానికి చెందినది - ఈయన ఆ రాష్ట్రానికి శానిటరీ యింజనీర్. విశ్వేశ్వరయ్య ఏడెన్ వెళ్లి, అక్కడి పరిసరాలన్నీ పరిశీలించి, నగరానికి 18 మైళ్ల దూరాన అహేజ్ వద్ద బావులు త్వవ్వించి, గొట్టాలద్వారా ఏడెన్ నీటి సమస్యను పరిష్కరించినందుకు, బ్రిటిష్ ప్రభుత్వం 'కెయిజర్ - ఇ - హింద్' స్వర్ణ పతకంతో ఆయనను సత్కరించింది.

కృష్ణరాజ సాగర్ జలాశయం, బృందావన్ గార్డెన్స్, భద్రావతీ ఐరన్ వర్క్స్, 1915 లో మైసూరు విశ్వవిద్యాలయ స్థాపన, కొల్హాపూర్ హైదరాబాదులలో నీటి వసరు పథకాలు, గంగానదిపై మొఖామే వంతెన, కార్ల ఫాక్టరీ బదులు విమానాల ఫాక్టరీ బెంగుళూరులో ప్రారంభమవడం - యిలా విశ్వేశ్వరయ్య సాధించిన విజయ పరంపర భారత ప్రజానీకపు భవిష్యత్తునే మార్చి వేసింది. ఒక జీనియస్ తన జాతి చరిత్రను ఎలా

శోభాయమానం చేయగలిగినదీ విశ్వే శ్వరయ్య జీవితం వెలుగు కిరణమై చెబుతుంది.

భారతీయులు అన్యదేశీయులకు ఏ విధంగానూ తీసిపోరనీ, పారిశ్రామికీ కరణ ద్వారానే జాతీయ సంపద పెంచడం సాధ్యమనీ నమ్మిన విశ్వేశ్వ రయ్యకు, గాంధీజీ పట్ల ఎంతో గౌర వమూ పూజ్యభావమూను. అలాగే గాంధీజీకి విశ్వేశ్వరయ్య గారంటే కూడా ఎంతో అభిమానం, అనురాగ మూను. ఇరువురి దృక్పథాలు వేరైన ప్పటికీ దేశాన్ని వెరొకకోణం నుంచీ గాఢంగా ప్రేమించారు. నూటొక్క సంవత్సరాలు జీవించిన (1861 - 1962) భారతరత్న 'కష్టించి పని చేయాలి, సంతృప్త మనస్కులు కావాలి ; కర్తవ్యాని సంతోషంగా నిర్వ హించాలి' అంటారు విశ్వేశ్వరయ్య పెన్‌పిక్చర్ మన కళ్లముందు వుంచారు జానమద్ది హనుమచ్ఛాస్త్రి.

—క్షీరసాగరమ్

అగ్నిసుధ - కవితలు. సుధామ. సనీకుమారి ప్రచురణలు, 16-11-310/9/1 సలీం నగర్ కాలనీ, మలక్‌పేట, హైదరాబాదు - 36.... వెల : రు. 20-00.

ఆకులు బాకులై మెరవడం, గాలి లో విమానం భోగిమంటలా విచ్చు కుని రాలిపడం, ఆలోచనను చింపి పోగులు వేయడం, రాత్రి వెన్నెల దుప్పటి కప్పుకున్నవాడు - ఉదయం సూర్యకిరణ స్నానం చేయక పోడ నడం, యిలాటివి చెప్పి '36 - వారంగీ లేన్' లోని వృద్ధ వనిత క్రిస్మస్ కేకుతో వెళ్లి తియ్యటి తేనెకత్తె గుచ్చుకోగా దిగ్భ్రాంతురాలవడం హృదయ విదారకంగా చిత్రిస్తారు కవి.

తొక్కడం వ్యవస్థ లక్షణం - అయినా ఎక్కడం వ్యక్తి లక్ష్యం కావాలి - అంటారు సుధామ. 'నిన్ను రైలెక్కించడానికి రాలేను' అను కవి తలో వాస్తవికత కొట్టొచ్చినట్లు కన పడుతుంది. జ్ఞాపకాల నావ, ప్రేమ పగుళ్లు, ఊహల ఊలు దారపు ఉండ లతో ఎంబ్రాయిడరీగా కవిత్వం, కమ్మని కలల దిండు, ఆలోచనల గ్రాఫ్ కాగితం – యిటువంటి పద చిత్రాలు మనసుపై ముద్రించే సుధామ 'అభ్యుదయ కవిత్వంలో ఇమేజరీ' గురించి 'యమ్‌ఫిల్' చేశారు. అక్షరాల బంతుల్ని సర్కస్ ఫీట్లతో ఎగరేస్తా డట కలలబేహారి.

—సుమతీ సాగర్

'జాగృతి' – పర్యాటక ప్రత్యేక సంచిక. సంపాదకులు : వి రామ్ మోహనరావు.... పిబి 1041, నారా యణ గూడా, హైదరాబాదు–29.... వెల : రు. 10-00.

'జాగృతి' వెలువరించే ప్రత్యేక సంచికలు అక్షరాలా ప్రత్యేకత గలవి. తెలుగులో ఆ గౌరవస్థానం 'జాగృతి' ఒక్క దానికే! 1991 ని

భారత ప్రభుత్వం 'పర్యాటక సంవత్సరం'గా పేర్కొంది. 1989 లో 13 లక్షలమంది విదేశీయులు మన దేశంలో పర్యటించారు. అయితే, ప్రపంచ వ్యాప్తంగా ఉన్న పర్యాటక పరిశ్రమతో పోల్చి చూస్తే, యిది అతి స్వల్పం.

బౌద్ధ భిక్షువులు నేపాలులోని లుంబిని నుంచి బుద్ధగయ మీదుగా సారనాథ్, అమరావతి, శ్రీ పర్వతం సందర్శించి సింహళం చేరేవారు. మన దేశాని కొచ్చిన ప్రాచీన పర్యాటకుడు 'టాలమీ' (గ్రీకు), ఆ తర్వాత హ్యూయన్ సాంగ్, నికోలో కోంటీ, అబ్దుల్ రజాక్, ప్లూటార్క్, మార్కొపోలో (రుద్రమదేవి కాలం) యిలా ఎందరో పర్యాటకులు మన దేశ పరిస్థితులని, వైభవాన్ని గ్రంథస్థం చేశారు.

'ఏయే దేశములన్ చరించితిరి మీరే యే గిరుల్ చూచినా – రేయే తీర్థములందు గ్రుంకిడితి రేయే ద్వీపముల్ మెట్టినా - రేయ్ పుణ్య వనాళి ద్రిమ్మరితి రేయే తోయధుల్ డాసినా - రాయాచోటులం గల్గు వింతలు మహాత్మా నా కెఱింగింపవే' - అని ప్రవరాఖ్యుడు (అల్లసాని పెద్దన 'మనుచరిత్రం') తను అతిథ్య మిచ్చిన సిద్ధ పురుషుని అడుగుతాడు.

మనకు గల తీర్థక్షేత్రాలు రెండు రకాలు : స్వయంభూత క్షేత్రాలు - అనగా సహజంగా ఏర్పడినవి ; ప్రభాస క్షేత్రాలు - అనగా నిర్మితమైనవి. ఆది శంకరుడు, అప్పటికి వ్యాప్తిలో ఉన్న బహు దేవతారాధనని, అయిదుగురికి పరిమితం చేశాడు. శివుడు, శక్తి, విష్ణువు, గణేశుడు, ఆదిత్యుడు, దక్షయజ్ఞం తర్వాత, శివుని భుజంపై వున్న సతీదేవిని, విష్ణువు సుదర్శన చక్రం ఖండించగా 18 చోట్ల ఆ శకలాలతో శక్తి పీఠాలు వెలిశాయంటారు ; 18 కాదు 51 అంటారు మరి కొందరు. ఏమయితేనేం, అవి భారతీయ ఏకాత్మతకు ప్రతీకలు. అలాగే, శివుని 12 జ్యోతిర్లింగాలూను.

ఆముష్మిక చింతన కంటె ఆధిభౌతిక దృక్పథం ఎక్కువవడం వల్ల వినోద విలాస యాత్రలపట్ల వుండే ఉత్సాహం తీర్థయాత్రల విషయంలో ఉండటం లేదు, ఉండగల అవకాశం లేదు. అది కాలస్వభావం. అయితే, పర్యటన ఏ ఉద్దేశ్యంతో జరిపినా, పర్యటానుభవాలు మనసుని విస్తృత పరుస్తాయి ; సహన సంపదను పెంచుతాయి.

దక్షిణ, ఉత్తర, పశ్చిమ, ప్రాక్ భారతలలోని దర్శనీయ స్థలాలు, క్షేత్రాలు, ఆంధ్ర ప్రదేశ్‌లో చూడదగ్గ ఇతర రాష్ట్రాలలోని సాంస్కృతిక వారసత్వం, చరిత్ర, శిల్పాలు, కట్టడాలు - యిలాటి వెన్నిటి గురించో ఈ ప్రత్యేక సంచిక సవివరంగా చెబుతోంది. ఆలయాల కలర్ ప్లేట్స్ ఆకర్షణీయంగా ఉన్నాయి. మీరెప్పుడు ఏ ప్రాంతాలకు వెళ్లదలుచుకున్నా రిఫరెన్స్‌గా ఉపయోగపడగల ప్రత్యేక సంచిక యిది.

బంగారం మీద

# ఎవ  ందుకు ?

## యన్నార్ చందూర్

తెల్లారి లేచి పేపరు తెరవగానే, పేవ్‌మెంటు మీద నడిచివెళుతున్న అమ్మాయి మెడలో గొలుసు కట్‌చేసి దుండగులు ఎత్తుకుపోయారనో, అర్థరాత్రి వేళ వెనకవైపు నుంచి యింట్లో చొరబడి, యింట్లో వాళ్లని బెదిరించో, గాయపరచో, బీరువాలోని నగలు ఎత్తుకు పోయారనో, విధిగా తాజా వార్త కంటపడుతుంది. 'అయ్యో పాపం' అనుకుంటాం. కాని, బంగారం యిలాటి ఘాతుకాలు చేయించడం అనాదిగా వున్నదే!

1511లో స్పెయిన్ రాజు ఫెర్డినాండ్, తన నౌకా సిబ్బందిని దక్షిణ అమెరికాకు పంపుతూ 'నయానో, భయానో బంగారం పట్టుకు రండి' - అని చెప్పాడట. పాశ్చాత్యుల బంగారం వేట. స్పెయిన్ పోర్చుగల్ దేశాలతో ప్రారంభమై, డచ్, బ్రిటన్, ఫ్రాన్సులతో పరాకాష్ట నందుకుంది. కొలంబస్, వాస్కోడిగామాలు దారి చూపగా, వీరు అవురావురుమంటూ ఆసియా, ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలియాలపై పడి చేతికందినంత బంగారం స్వంతం చేసుకున్నారు. డిజరైలి ఒకసారి, బ్రిటిష్ పార్లమెంటులోని కామన్స్ సభలో అన్నాడట: 'అందగత్తెల వలపు చూపులకి వశరైన వారి కంటె, బంగారానికి దాసోహమన్న వారే ఎక్కువ' అని.

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో ప్రఖ్యాత నవలాకారుడు అప్టన్ సింక్లయిర్, 'వరల్డ్ ఎండ్ సీరీస్' అని పది సంపుటాల బృహత్కథ రాశాడు. అంత పెద్దనవల, నాకు తెలిసినంతలో, మరింకెవరూ రాయలేదు. అందులోని కథానాయకుడు 'లానీ బడ్' నాజీ జర్మనీ నుంచి ఒకకారు, స్విట్జర్లాండ్ మీదుగా బయటికి తీసుకొస్తాడు. సరిహద్దు గస్తీదళం తనిఖీ చేసి వొదిలేస్తారు. బయటికి వచ్చాక మనకి తెలుస్తుంది. మడ్‌గార్డ్సూ, బంపర్లూ, బాడీ - మొత్తం అంతా బంగారమని - పైన మాత్రం మామూలు పెయింట్ వేశారు. గస్తీ పోలీసులు కారులో ఏమున్నావున్నాయేమో చూస్తారుగాని, మొత్తం కారే బంగారమని ఎలా అనుకోగలరు?

ఐగుప్తీయ, రోమన్ సామ్రాజ్యాలు బంగారం వల్లే నిలబడ్డాయి. ఆరువేల సంవత్సరాలుగా స్త్రీ పురుషులు ఈ బంగారం కోసం కలలుకంటున్నారు, ఆరాటపడుతున్నారు, అబద్ధాలు చెబుతున్నారు, వంచించుకుంటున్నారు,

గొంతులు నులుముకుంటున్నారు. 1848 నాటి శాన్ ఫ్రాన్సిస్కో గోల్డ్ రష్, 1852 నాటి ఆస్ట్రేలియా గోల్డ్ రష్, 1897 నాటి క్లాన్‌డైక్‌ది - గోల్డ్ రష్ అంటే బంగారం సులువుగా దొరుకుతుందనే వెర్రి పరుగు - ఈ గోల్డ్ రషెస్‌లో వేల సంఖ్యని మనుషులు నశించి పోయారు. అయినప్పటికీ తెలివి రాలేదు - బంగారం మీద ఆశ వొదల్లేదు.

వెండికి రెట్టింపు బరువు వుండే బంగారం లోహాలన్నిటిలోకీ ఎంతో విలువైనది. అతి పల్చని ఆకు చేయవచ్చు; అతి సన్నని తీగె తీయవచ్చు. ఒక తులం బంగారంతో తీయ గలిగినంత పొడవైన తీగె, మరింకే లోహంతోనూ రాదు. స్వర్ణకారుని చేతిలో బంగారం వివిధానేక రూపాలు దాల్చి సొగసులు పోయి, సౌందర్యకాంతులు చిమ్ముతుంది. ముద్ద బంగారం 24 కారట్లు; అందులో రాగి కలిసి 22కి తెస్తే గాని నగలు తయారు కావు: ఒకప్పుడు మన దేశంలో బంగారు నగలు స్త్రీ ధనం - పెళ్లి సమయంలో పెట్టేవి గనక! పసుపు కొమ్ము గాక, 'మూడు ముళ్ల మంగళ సూత్రంలో చిన్నమెత్తు బంగారమైనా వుండాలనే సంప్రదాయం. రాను రాను బంగారు తాడు, చంద్రహారం, కంటె, కాసుల పేరు, వంకీలు, వడ్డాణం, ఆరు జతల గాజులు — అలా దిన దిన దిన ప్రవర్ధమానమవుతూ వచ్చింది వారి వారి తాహతుని బట్టి!

1914 దాకా గోల్డ్‌స్టాండర్డ్ ఉండేది - అంటే చెలామణీ అయ్యే ద్రవ్యం, ప్రభుత్వ ఖజానాలోని బంగారానికి సమానమై వుండాలి. 1925 నుంచి 1934 దాకా గోల్డ్ బులియన్ స్టాండర్డ్ వచ్చింది. అంటే, విడుదల చేసే పేపర్ కరెన్సీ, ప్రభుత్వ ఖజానాలోని బంగారానికి సమానమై వుండాలి. 1945 తర్వాత ప్రపంచ వ్యాప్తంగా పరిస్థితులు తారుమారయాయి.

అమెరికాలోగాని, రష్యాలోగాని, యితర పాశ్చాత్య దేశాలలోగాని బంగారు నగల షాపులు మన దేశంలో మాదిరి వుండవు. స్త్రీలు ఆభరణాలు ధరించరు - ఒక్క వెడ్డింగ్ రింగ్ తప్ప. చాలావాటిలో పాశ్చాత్యుల ననుకరించే మనవాళ్లు, ఈ నగల పిచ్చి ఎందుకు వొదులుకో లేకుండా వున్నారు? గాంధీగారి కాలంనాటి ఆదర్శం ఎందువల్ల మటుమయమైంది? హరిజననిధికి నగలు యివ్వటమేకాదు, మళ్లీ చేయించి పెట్టుకోననే మాట కూడా తీసుకొనే వారాయన.

స్త్రీలకు నగల పిచ్చి తగ్గితే, బంగారం బిస్కత్తుల గిరాకీ వుండదు. వొంటి మీద యింట్లోను వున్న బంగారం నిష్కారణంగా ప్రమాదాలకు గురి చేస్తుంది. 'లక్షాధికారైన లవణమన్నమె కాని - మెఱుగు బంగారంబు మ్రింగబోడు' - అని ఏనాడో హెచ్చరించింది నరసింహ శతకం. కాని, ఎందరికి గుర్తు?

20 టన్నుల బంగారం స్విస్ బాంకుకి, 25 టన్నుల బంగారం

బాంక్ ఆఫ్ ఇంగ్లాండ్‌కి భారత ప్రభుత్వం రుణ సౌకర్యం కోసం పంపిందని పత్రికలలో చదివే వుంటారు. కాని, పోయిన సంవత్సరం మన దేశంలో 240 టన్నుల బంగారం అభరణ రూపం దాల్చింది .... కోలారు గనులలో సాలీనా కేవలం ఒక్క టన్ను తప్ప మనకు యితరత్రా బంగారం సంపద లేదు. బంగారు ఖనిజంలో ప్రథమస్థానం దక్షిణాఫ్రికాది - సాలీనా 605 టన్నులు ; ద్వితీయ స్థానం అమెరికాది 295 టన్నులు ; తృతీయస్థానం సోవియట్ యూనియన్‌ది - సాలీనా 260 టన్నులు. కాని, అక్కడ ఎక్కడా బంగారు నగల మోజు భారత దేశంలోకి మల్లేలేదు.

**ఆకాశవాణి - మద్రాసు కేంద్ర ప్రసారితం ఆగస్టు 19, 1991**

---

కొత్తవారి పట్ల సౌమ్యత, సౌజన్యత చూపే మనిషి ప్రపంచ పౌరుని కింద లెఖ్క —ఫ్రాన్సిస్ బేకన్

విరిగిన చేయి పనిచేస్తుంది; విరిగిన హృదయం చేయదు.

—పెర్సియన్ సామెత

చెట్టు ఎంత పెద్దదో దాని నీడ తెలిపినట్లే, గొప్పవారి ఘనత శత్రువులు తెలుపుతారు —చైనీయ సామెత

మీ అభిప్రాయం నేను ఆమోదించను. కాని, మీరు మీ అభిప్రాయాన్ని వెల్లడించగల స్వాతంత్ర్యాన్ని మాత్రం, నా ప్రాణాలు వొడ్డి కాపాడుతాను. —వాల్టేర్

సంక్షిప్త భాగాలు

# 'నా రాట్నచక్రం'

## తల్లాప్రగడ ప్రకాశరాయుడు

 

గాంధీ గారికి సత్యాగ్రహోద్యమం, నిర్మాణ కార్య క్రమం రెండు నేత్రాల వంటివి; రెండూ పరస్పర ఆశ్రితాలు. స్వాతంత్ర్య పోరాటంలో ఒక భాగమైన 'వ్యక్తి సత్యాగ్రహానికి' ప్రప్రథములుగా ఆయన వినోబా భావెని ఎన్నుకున్నారు; జవహర్‌లాల్ నెహ్రూ రెండవవారు. 'జాతి పిత'గా దేశం గాంధీజీని గౌరవించి, సర్వోదయ సిద్ధాంతానికి కొత్త ఊపిరి నిచ్చిందే గాని, గాంధేయ పథం విస్మృతి పథాన పడింది.... రాజకీయ పదవులు ఆశించకుండా, గాంధీజమ్‌కి కట్టుబడి, నిర్మాణ కార్యక్రమానికి అంకితమైన మహానుభావులలో తల్లాప్రగడ ప్రకాశరాయుడు గారొకరు.... కేసరిగారి 'చిన్ననాటి ముచ్చట్లు' చదివి మెచ్చుకున్న పాఠకులు, అటువంటిదే మరొకటి వేయ మని కోరగా, ప్రకాశరాయుడిగారి జీవితం సంక్షిప్త పరిచయం చేదామని అనిపించి, బుద్ధప్రసాద్ గారికి, రాజారామ్ గారికి అనుమతికోసం వ్రాశాము. ఇరువురూ వెంటనే అంగీకరించి నందుకు మా మనఃపూర్వక కృతజ్ఞతలు.



ఆ సమయంలో, మేమున్న అద్దె యింటికి స్వయంగా వచ్చి, నా మంచంమీదనే కూర్చుండి 'ఏం రా, జ్వరం వచ్చిందా? అదే పోతుంది - భయంలేదు. నెమ్మదించిన తరువాత స్కూలుకు రావచ్చు. పరీక్షల బెంగ పెట్టుకోకు' అని నాకెంతో ధైర్యం చెప్పి వెళ్లారు. హెడ్మాష్టరు మా యింటికి రావడమేటని చెప్పి మాలమ్మ మున్నగువారు ఆశ్చర్యపోయారు.

ఆ స్కూలులోనే సైన్సుబోధలో ఉద్దండుడు, ఇవటూరి మృత్యుంజయుడుగారు. సరిగా పాఠం చదవని విద్యార్థులను 'గాడిద వెధవా!' అని మందలించేవాడు. ఫోర్త్ ఫారమ్‌లో మాకు కొంత ఇంగ్లీషు, హిస్టరీ చెప్పే రాఘవాచార్లుగారుండేవాడు. శిష్యుల మీద ఆయనకు కోపం వచ్చినప్పుడు 'ఏడిచావులే పెసర పప్పులాగు మొహం నువ్వూను!' అని ఒకణ్ణి, 'ఓరి పాతచింతపండూ!' అని యింకొకణ్ణీ అనేవాడు.

మా క్లాసులోని ధూళిపాళ సత్యనారాయణకు 'బిషప్' అని ఆచార్లిచ్చిన పేరు. మా ఇంగ్లీషు హిస్టరీలో ఎవరో ఒక బిషప్ బొమ్మ ఉండేది. అచ్చు ఆ బొమ్మలాగునే ఉండేవాడు ధూళిపాళ. కనుక వాడికా పేరు. అసలు మనిషి పొట్టి, మెడ యింకా కురచ, తలమీద అల్లిక ఊలు డిప్పటోపీ, తలకు అతుక్కొని చెవుల వరకూ దిగబడివుండేది. ఇదంతా కనిపెట్టి ఆచారి మాస్టరు వానినెప్పుడు 'ఒరే బిషప్' అనే పిలిచేవాడు.

ఆ మూడేళ్లూ నేను పానుగంటి అన్నాజీరావు జత గాళ్లమని క్లాసందరు అనుకునేవాళ్లు. వాడి పుస్తకాలు నోట్స్ బుక్స్, దస్తూరి చాల శుభ్రంగా నుండేవి. ఒక్క తప్పులేకుండ పెరుమాల్ వెట్టి పెన్సిల్‌తో నోట్స్ వ్రాసేవాడు. నోట్స్ కూడ ఏకుర్రవాడూ ఉపయోగించని తెల్లని నున్నని పాలకోవా కాగితాల పెద్దసైజు నోట్స్ బుక్కులో వ్రాసేవాడు. తరచు సాయంకాలం మేమిద్దరం కలిసి "గోస్తనది" కాల్వ యొడ్డున షికారుకు వెళ్లేవాళ్లం.

సబ్జెక్టు లన్నిటిలోను చిత్రలేఖనం (డ్రాయింగు) నాకెక్కువ యిష్టం. డ్రాయింగు మాస్టరు దగ్గరనున్న పైడి పద్రురోడ్డుకు విద్యార్థులను తీసుకొని వెళ్లి, ఒక్కొక్కణ్ణి ఒక చెట్టు, లేక మొక్క, లేక పువ్వువద్ద కూర్చోబెట్టి, దాని ఆకృతి కాగితంమీద వ్రాయమనే వాడు. సరిగా వచ్చినా, రాకపోయినా, ఆ పనికి ముందుగా నేను తయారయ్యేవాణ్ణి. హిస్టరీ పుస్తకంలోనున్న మొగల్ సుల్తాన్లు, బ్రిటిష్ వైస్రాయిలు మున్నగువారి బొమ్మలను దళసరి కాగితాలమీద రిప్రొడ్యూస్ చేయడం, వాటి నితరులకు చూపించి, బాగున్నవనిపించుకొని ఆనందించడం నా కలవాటు - క్లాసులో గణపతి లింగం అనే ఒక జంగం కుర్రవాడుండేవాడు. చిత్రలేఖనంలో ఎప్పుడూ అతడు ఫస్టు, నేను సెకండు....

మా యింగ్లీషు స్టాండర్డ్ కొంత పెరిగియుంటుంది. రాబర్ట్ బ్రవునింగ్ ఆంగ్లమహాకవులలో పేరొందినవాడు. అతడు కూర్చిన కథాకావ్యాలు చాలా వున్నాయి. 'Pied Piper of Hamilin' మనోరంజకమైన పట్టణమంతా నిండి, ఊపిరాడకుండా పట్టణవాసుల నేడ్పించుకొని తింటూన్న పందికొక్కు, యెలుకల కథ యిది. దానినెంత చాకచక్యంగా వర్ణించి మన కండ్లకు కడతాడో చెప్పతరం కాదు. అరవైడెబ్బయ్ ఏళ్లకు పూర్వం మా హెడ్మాస్టరు ముఖతావిన్న ఈ కథ మరల

ఈనాడు చదువుకుంటే లేక వింటే, లేక ఇతరులకు తిరిగి చెపితే అతి ఆకర్షణీయంగాను, నీతిదాయకం గాను ఉంటుంది. ఒక పిల్లవాణ్ణి సంబోధిస్తూ చెపుతాడు కవి. "So Willy, if we have made any promise to any one, mind you, we must keep our promise" ఇవీ కథలోని చివరి పంక్తులు.

## 9
## హితకారిణి - వీరేశలింగం

గణితం సబ్జెక్టులో డిఫెక్ట్ వల్ల తణుకులో (1909) మెట్రిక్యులేషన్ పరీక్షలో తప్పి, 1910 జనవరి నుండి 1911 ఏప్రిల్ వరకు, 14 నెలలు రాజమండ్రి వీరేశలింగంగారి హితకారిణీ హైస్కూలు యస్.యస్.యల్.సి. చదువులో ప్రవేశించాను. మెట్రిక్ పద్ధతిపోయి యస్.యస్.యల్.సి. రావడంవల్ల ఆ సంవత్సరం మరికొన్ని నెలలు పొడిగింపబడది. యస్.యస్.యల్.సి. పెండ్యాల సత్య నారాయణరావు (తదుపరి PS Rao, ICS) నేనూ అత్యంత ప్రియ మిత్రులం. అతడు ఏనాడో రిటైరయి ఇప్పటికీ హైదరాబాద్ నివాసిగా నున్నాడు. దేశవిఖ్యాతి నొందిన సంఘసంస్కర్త వీరేశలింగంగారు.

 





అనేక సాంఘిక యిబ్బందులను, దూషణ తిరస్కారాలను ఎదుర్కొని నిర్భీతితో నిలిచిన ధీరుడు ఆయన. ప్రధానంగా చేపట్టి నిర్వహించినవి నాలుగైదు సంస్థలు: (1) విక్టోరియా హిందూ వితంతు శరణాలయం; (2) ఆయన సంస్థ లన్నిటిపై అజమాయిషీకిగాను తనతో కలిసివచ్చే పట్టణ పెద్దలతో యేర్పడిన 'హితకారిణీ సమాజం'; (3) ముప్పది యకరాలకు మించిన ఫలవృక్షాల తోటలో స్వంత భవనం, వితంతు శరణాలయం నిర్మించుకొని, భార్యా సమేతుడై, దశాబ్దాల వరుసను అందు నివసిస్తూ ఆయన చేసిన రకరకాల ఉత్తమ సాహిత్య రచన ప్రచురణ; (4) తాను స్వయంగా బాలావరకు స్వంత ఖర్చుతో నిర్మింపజేసిన పురమందిరం, ప్రార్థన సమాజ మందిరం; (5) సర్వ జనులకు ఉపయోగపడే పెద్ద పుస్తక భాండాగారం. ఇట్లా నవ్యాంధ్ర నిర్మాతగా ఆయన పేరుపడ్డారు. విద్యార్థిదశలో ఆయన స్కూలులో నేను చదువుకొన్నది ఒక్క యస్.యస్.యల్.సి. యే అయినా, నావంటి మరికొందరు (కొద్దిమందియే కావచ్చు) ఆయన కార్యక్రమాలతోనూ, అభిప్రాయాలతోను అతుక్కొనిపోయినాము. అంతకు పూర్వం నేను చదువుకున్న స్కూళ్లు ఆ చదువులు ఒక యెత్తు, వీరేశలింగం స్కూలు అనుభవాలు ఒక యెత్తు. ఇక్కడ ఒక వంక స్కూలు పాఠాలు నేర్చుకుంటూనే, (కొంత మందిమి) మాకు చెప్పడిన మోతాదులో, మనసా, కర్మణా ఆయన అనుచరులమైయుంటి మనడంలో అత్యుక్తిలేదు. చదువు పేరిట ఇందుకే నేను రాజమహేంద్రవరంలో పడవేయబడ్డాను. తత్పర్యవసానంగా 'నీ దేవూరు?' అని యెవరైన అడిగితే, రాజమహేంద్రవరమే నాయూరని చెప్పుకోనడం నాకలవాటయింది. ఒకవంక వీరేశలింగంగారి సంఘసంస్కరణోద్యమం, వేరొకవంక, 1921 లో గాంధీ జాతీయోద్యమం. ప్రార్థన సమాజ సమావేశాలు స్కూలు చదువుకంటె ఎక్కువ విలువైనవిగా ఉండేవి.

## 10
## కాకినాడ కాలేజి

రాజమండ్రి యస్.యస్.యల్.సి. తరువాత సాధారణంగా అందరి వలెనే పైచదువు యింటర్‌మీడియట్‌కు పోవలెననే ఆలోచన నాలో కలిగింది. నన్ను పైకిచదివించ వలెననే ఉద్దేశం మేనమామ కున్నదో లేదా నాకు తెలియదు. ఇంటర్మీడియేట్, బి.యే. లంటే మాటలా? డబ్బు ఖర్చుతోకూడిన పని. పైచదువు, ఆపైన ఉద్యోగం విషయం అట్లావుంచి, వీరేశలింగంవంటి సంఘసంస్కర్త, కాకినాడ కాలేజి ప్రిన్సిపలు, ఆర్. వెంకటరత్నం నాయుడుగార్ల వద్ద శుశ్రూష చేస్తే జీవితం కొంత వన్నె తేరగలదనే తెలిసీ తెలియని కాంక్ష ఒకటి లోపల ప్రవేశించింది. ఆ వేసవి సెలవుల్లోనే నేనూ మా కామేశ్వరరావూ

కలిసి కాకినాడ కాలేజిని చూచిరావడానికి ప్రయాణమయ్యాము. ఒక బంధువింట భోజనంచేసి, కాలేజి బిల్డింగులు పారజూచి, తిరిగి రాజమండ్రి వచ్చాము. అంతకు పూర్వం ఒకనాడు మా పాత హితకారిణీ స్కూలు చదువులో వీరేశలింగంగారిని వెంట దీసుకొని నాయుడుగారు స్కూలుకు వచ్చి, తాటాకు పాకలలో నుండిన మా క్లాసులను బయటనిలబడి పరిశీలిస్తున్నారు. క్లాసులో నా ప్రక్క కూర్చుండిన విద్యార్థియొకడు నాయుడుగారి వంక చూస్తూ, అయనే కాకినాడ కాలేజి ప్రిన్సిపల్ అన్నాడు. నాయుడుగారి ఆ నిండు విగ్రహాన్ని చూచి నాకేదో చెప్పలేని సంతోషం కలిగింది. తెల్లని సఫేద్‌లాంటి షరాయి, తెల్లని లాంగ్‌కోటు, వాటిపైన తెల్లని తోక తలపాగా, అమధ్య వాటితో సమానమైన తెల్లని మీసాలు, తెల్లని గిరజాల జుట్టు, చూచి 'ఓహో, ఈయనేనా నాయుడుగారంటే - కాకినాడ కాలేజి యీయనదేనా - సరే!' నని ఆనందించాను.

తరువాత ఆ కాలేజిలో అడ్మిషన్‌కు నేను దరఖాస్తు చేయడం, "You will be admitted" అని ప్రిన్సిపల్ హస్తాక్షరితో ఒక Post Card జవాబు రావడం జరిగింది. నాకు మరేంకావాలి - ఎట్లాగైనా వెళ్ళి వారిచేతుల్లో పడి చదువుకోవాలనే బులవాటం రోజు రోజుకూ అధికమయింది. కాని డబ్బొకటి, నా గార్డియన్ మేనమామ అనుమతి యొకటి కావాలి. గ్రామకరణంగా అయన ఆ సమయంలో తణుకు జమాబందీలో నుండెను. ఇపుడు డబ్బు



?

"Father, is it true that Rama had to perform last rites for three persons in succession before he could approach Sugreeva for help to trace out the whereabouts of the abducted princess?" asked Raghu.

"You are not completely correct, my boy. For Jatayu, the king of forest birds, he performed the last rites. About Kabandha, it was different. After cutting down his arms, they pushed that huge gigantic figure into a deep pit dug by them and covered it with mud. With breathlessness he ended and reappeared as Danuvu, the original Gandharwa," explained Raghu's Father

"Yes yes - I know, these Gandharwas dot not die. They assume monstrous forms for their sins and misdeeds."

"So, the question of performing last rites to Kabandha never arose and you should not forget, that it was Kabandha who asked Rama to proceed towards Rushyamuka Mountain and on the way visit Sabari who had been anxiously waiting for him all these years. Sabari felt overjoyed on seeing Rama, gave him delicious fruit to eat, took leave of him, sat in *Padmasana* inviting *Yogagni*. The two brothers were thunder-struck and felt thrilled on seeing the sacrificial fire consuming her, reducing the frail body to ashes. Thereafter they took a purification bath. To Jatayu alone, Rama had to perform the last rites," said Raghu's Father.

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600 103.*



కావాలి. ఎవరిస్తారు? 17 వయస్సు వచ్చి, డబ్బు కోసం మేనమామను యిబ్బంది పెట్టడంకూడదనే ప్రపంచ జ్ఞానంకూడ నాకపుడు లేకపోయింది. ఇపుడా మాట తలుచుకుంటేనే ఆశ్చర్య మవుతుంది. తరువాత విన్నాను ఒక సంగతి: యస్.యస్.యల్.సి. తో నా చదువు పూర్తిచేయించి, తాలూకా కచేరీలోనో మరిదేంట్లోనో గుమాస్తాగా ప్రవేశపెట్టాలని ఆయన అనుకున్నాడట. అప్పుడు తాలూకా గుమాస్తాల నెల జీతం పదిహేను రూపాయలు. ఆయనకుండిన ఈ తలంపు నాకు తెలియదు. కాని కాకినాడ పోయి నాయుడుగారి వద్ద చదువుకోవాలనియే నా ఆరాటం. 'ఇంట్లో మా అమ్మను పట్టుకున్నాను. ఏం చేయమంటావురా, నాయనా! నాకేం పాలుపోవడంలేదు. మామయ్య ఊళ్లోలేడు. నేనేం జేసేది? అతను వచ్చి ఏమనుకుంటాడోయేమో, మనను పెంచి పోషించేవాడు అతను. స్వతంత్రించి నేనేమి చేయగలను? అదీగాక హఠాత్తుగా నాకు డబ్బెక్కడ పుడుతుంది?' అంటూ నన్నూరడించ డానికి ప్రయత్నించింది తల్లి. నా ఘోష, నాపోరు పడలేక, దొడ్డిగోడ అవతల నున్న కోమటి పాపమ్మను పలకరించి ఆమెతో యీమాట చెప్పింది మాఅమ్మ. 'అబ్బాయి పోతా నంటే పోనియ్యి - ఆపకు. శేషయ్య వచ్చిన తరువాత చెపుదాంలే! ఇప్పుడు డబ్బెంత కావాలో చెప్పు' అంది పాపమ్మ. "ఇపుడు రు 15/- చాలు. అది రాజాగారి కాలేజి. డబ్బులేనివాళ్ల నుండి జీతాలు తీసుకోరట. ఆవిధంగా నాకూ రావచ్చు స్కాలర్‌షిప్పు" అని మా అమ్మకు ఓదార్పు మాటచెప్పి, రెండుమూడు గుడ్డలు మూటకట్టుకొని, ఒక్కణ్ణే కాకినాడకు బయలుదేరి పోయి నాను. వెళ్లగానే కాలేజిలో ప్రవేశం దొరికింది. ఈలోగా మేనమామ జమా బంది ముగించుకొని యింటికి వచ్చాడు. మామకంటె మాఅమ్మ వయసులో పెద్దదైనా, ఆయన మగ వాడు, కుటుంబ పోషకుడు కనుకను, ఈమె స్త్రీ కనుకను, ఆయన మాటకు చేతకు సహజంగా లోబడియుండేది. ఆకాలపు సంఘమర్యాదలవి. 'ఏమో రా, నాయనా, నీతో ఏమి చెప్పాలో తెలియడంలేదు. కాకినాడ చదువుకు పోయి తీరాలంటాడు. అక్కడ వేర్చు కుంటామని వీడికి ఉత్తరంకూడ వచ్చిందట. చదువుకు ముందు డబ్బు కావాలికదా - ఆడబ్బు మనదగ్గర యేది? వద్దురా బాబూ మామయ్యను రానియ్యి అని నేనకేవిధాల చెప్పి చూచాను - వినలేదు. సీమకుర్తి పాపమ్మ వద్ద రు 15/- బదులుచేసి యిచ్చాను. పదిహేను చాలునన్నాడు" అంటూ ఒకవిధమైన జంకుతో తమ్మునితో చెప్పింది. అక్కగారితో ఆయన ఒక్కటేమాట అన్నాడట. 'మంచిపని చేశావు. వాడికి చదువుకో వాలనే కాంక్షవుంటే, చదువే చెప్పించ లేకపోతామా!' ఆ మాటతో మా అమ్మకు ధైర్యం చిక్కింది.

కాకినాడలో ఆ తెల్లషరాయి, తెల్లని లాంగ్‌కోటు, తెల్లని తోకతల

పాగా, తెల్లని కత్తిరింపు మీసం, తెల్లని గిరజాజుట్టుతో నుండిన ఆ పాదుషా ప్రిన్సిపలుకు శిష్యుడనైనాను. పబ్లిక్ పరీక్షలో నాకు లెక్కల సబ్జెక్టులో మార్కులు బాగా తక్కువ వచ్చినా, నా అదృష్టంవల్ల నేను బూరెలగంపలో పడ్డాను. అప్పటికింకను ప్రతి సబ్జెక్టులో యింతింతశాతం మార్కులు వచ్చితీరాలనే నిబంధన లేదు. అదే నా అదృష్టం. శ్రీ వేమూరి రామకృష్ణారావుగారు, ఇంటర్ చదువుకు అధ్యాపకుడిగా నాయుడుగారి తరువాతి పెద్ద. బందరు క్రైస్తవ మిషన్ స్కూలులో నాయుడుగారి శిష్యుడే రామకృష్ణారావుగారు. క్షుణ్ణం గా ఇంగ్లీషుపాఠం నూరిపోయడంలో బహుప్రవీణుడు.... కొన్నేండ్ల పిదప నాయుడుగారు రిటైరైన తరువాత, రామకృష్ణారావుగారు కాలేజీ అధ్యక్ష పీఠాన్న లంకరించారు. ఆయన చదువుకున్నది సముద్రమంత చదువు. ఆయన ఆజన్మ బ్రహ్మచారి. చేసుకున్న భార్య చిన్నతనంలోనే కాలధర్మం పొందడంవల్ల యావజ్జీవ బ్రహ్మచర్యం. అధ్యాపకుడుగాను, కాలేజీ నిర్వహణలోను ఆయన పాటించిన క్రమశిక్షణ, పాలనా విధానం అనన్యం. విద్యార్థులకిచ్చే పరీక్ష మార్కులు, ప్రమోషన్లు మున్నగు విషయాలలో ఎట్టి పక్షపాతం, మొగమాటం అనరాదు, వినరాదు ఎవరి శిఫార్సులు ఖాతరు చేయని వ్యక్తి.

గుడిపాటి వెంకటచలం— ('చలం') నేను ఇంటర్ పరీక్షకు మద్రాసు సెంటరుకు వెళ్ళి, అప్పుడక్కడ కండ్లజబ్బుతో నుండిన గురువర్యుడు రామకృష్ణా రావుగారిని దర్శించడానికి వెళ్లాము. ఆయన దృష్టి బాగాలేక మా పేర్లు చెప్పుకున్నాం. చేతులుబావి, మా యిద్దర్నీ దగ్గరకు చేర్చుకొని 'వచ్చార్రా నాయనా! నా మీద మీకింత ప్రేమా? ఎప్పుడొచ్చారు? పరీక్షకు మీ సీట్లు ఏ కాలేజీలో వేశారు? చాల సంతోషంరా బాబూ!' అంటూ మమ్మెంతగానో ఆదరించారాయన.

కాకినాడచదువు అయిన తరువాత 'చలం' మద్రాసుకు వెళ్లి క్రిష్టియన్ కాలేజీ బి. ఎ.లో చేరాడు. నేనెప్పుడో ఒకసారి మద్రాసుకు వెళ్లి అతనితో నుంటిని. అప్పుడు యిద్దరం బార్బర్స్ బ్రిడ్జి మీద నడుస్తుండగా ఒక సంభాషణ: Free Will వ్యక్తి స్వేచ్ఛ అంటే పురుషప్రయత్నంకూ దైవేచ్ఛ లేక నియతిలేక బ్రహ్మవ్రాత (Predestination) కూ గల నిష్పత్తి లేక తారతమ్యంగూర్చి వెంకటచలం నన్ను ప్రశ్నించాడు. అదేమాట రెట్టిస్తూ మరల నేనతణ్ణి అడిగిన ప్రశ్నకూడ అదే. అతనే నాకిట్లా ప్రత్యుత్తరమిచ్చాడు: 'మానవప్రయత్నంయొక్క ఆవశ్యకత, ప్రాముఖ్యం ఉండనే ఉంది. చివరకు ఈశ్వరేచ్ఛదే పైచేయి కదా!' అన్నాడు. ఏలనోగాని అప్పటికే నా మనస్సులోని నమ్మకంగూడ అదే. తరువాత అది మరింత బలపడుతూ వచ్చింది. ఎవరో అన్నారని చెప్పి దేనిని గాని ఖాయపరచడం కాదు.

ధర్మవిదుడు, సత్యాగ్రహి యగు గాంధీ కూడ కించిజ్ఞుడగు మానవుని మీద సర్వజ్ఞుడు, సర్వనియంత అగు భగవంతునికే సర్వాధిపత్య మిస్తాడు. "భగవంతుని వేణుగానం మీదనే నా జీవితపు ఆట ఆధార పడియుంటుం దనీ అయనను కాదనే నా స్వంత. అణుమాత్రం లేదనీ" అంటాడు. ఆయన ప్రేమస్వరూపుడు, దయా సాగరుడు మాత్రమేకాదు. ఆయన ప్రేమలో కాఠిన్యంకూడ ఉంది.

అధ్యాపకుడుగా నాయుడు గారిది అసాధారణ ప్రజ్ఞ. విద్యార్థు లాయన బోధన, భక్తి శ్రద్ధలతో మనసు కెక్కించుకోవాలే గాని ఆయన నుండి మాకబ్బింది పుస్తకపు చదువొక్కటే కాదు. బ్రతుకును బాగుపరచే విషయా లెన్నో ఆ చదువు ద్వారానే మాకు లభించేవి. అప్పుడప్పుడు సాయం కాలం చీకటిపడ్డ తరువాత పెట్రో మాక్సు లైట్లు తెప్పించి మమ్ము కూర్చోబెట్టేవారు. స్వభావ సిద్ధంగాను, అనుభవంవల్లను అన్ని విషయాలు

ఆయనకు కొట్టిన పిండి. విశేష మేమంటే, పాఠంలో మధ్య మధ్య ఆయన చెప్పే పిట్టకథలు, హాస్య లహరి అసంబద్ధంగా గాక పాఠానికి అనుబంధంగానే ఉండేవి. వాటిని విన్నవాళ్లు మరి మరచిపోవడ ముండదు. పూర్తిగా మాకు తెలుపనిదే దాటి ముందు వాక్యానికి వెళ్లడు. ఇన్ని దశాబ్దాల వ్యవధిలో మరల దాని నెపుడైన చూచానా! చదివానా నేను! అది యిప్పటి వరకూ మనసున పట్టే వుందంటే ఆనాటి గురుబోధనయే దానికి కారణం. అది మరపురాని సత్యం కావడం మరొక కారణం. అట్లాగే మరొకటి. "God fulfils Himself in many ways, lest one good custom should corrupt the world" అనే Tennyson పలుకులకి చేయవలసి నంత వ్యాఖ్యానం చేసి మరీ విడిచి పెడతాడే కాని, విషయాన్ని తొందరగా దాటవేయడు. విద్యార్థి యోగక్షేమం అధ్యాపకుడు కనిపెట్టడమంటే యింతకు మించి మరేముంది! ఆ చెప్పేది యాదాలాపంగా గాక తన జీవితానికి కావలసిందే యని విద్యార్థి అనుకోవాలి.

"Love had he found in huts where poor men live. His daily teachers had been woods and rills, the silence that is in the starry sky, the sleep that is among the lonely hills!" (వర్డ్స్ వర్త్ కథా కవితలో కష్టాల పాలైన రాకుమారుని దేశ ప్రజలు ఆహ్వానించడం) ఇటువంటి వజ్రపు తునకలు మనసుకు వచ్చి నపుడు మనం ఆ వాతావరణంలో లీనమై పోతాము. నాయుడుగారి ఆ చల్లని చూపులో, ఆయన చల్లని హృదయ స్పర్శలో బ్రతికిన అంతేవాసులు అదృష్టవంతులు. అట్టి భాగ్యంలో నా పాలు నాకు దక్కింది.

ఆశీర్వాదరావు అనే విద్యార్థి మా క్లాసు పెద్దగా నుండేవాడు. చదువులో మావంటి సామాన్యుడే యైనా, ఒడ్డు పొడుగుల్లో అందరి కంటె బాగా మిన్నా. వయస్సున గూడ మాకంటె పెద్దవాడే కావచ్చు. నేను క్లాసులో ఎక్కువగా అల్లరి చేస్తున్నానని చీటి వ్రాసి మరో బిల్డింగులో ఏదో వ్రాత పనిలో నున్న ప్రిన్సిపల్ నాయుడు గారి ముందుంచి వచ్చాడు. అది చూచుకొని ఆయన నన్ను పిలువ నంపారు. భయభక్తులతో వెళ్లి ఆయన టేబిల్ ప్రక్క నిలబడ్డాను. 'ప్రకాశరాయుడూ నీవు అల్లరి చేస్తున్నావంటాడేమిటి ఆశీర్వాదరావు?' అన్నారు. ఏం చెప్పాలో తెలియలేదు - భక్తితో గూడిన భయం! 'ఏమోనండి - ఏం చేశానో నాకు తెలీదన్నాను.' 'అదే నాకూ ఆశ్చర్యంగా వుంది, సరే వెళ్లు' అన్నారాయన.

(ఇంకా వుంది



అగస్టు 20, 1991

నిన్నరాత్రి శాస్త్రిగారు టెలిఫోన్ చేసి, 'నేషనల్ యూనిటీ కాన్ఫరెన్స్ వారు మీకు అందజేయమని, ఢిల్లీలో నా చేతికిచ్చిన ఇన్విటేషన్ నా దగ్గిరే వుండిపోయింది. ఈ రెండురోజులుగా వూపిరాడక, మీ యింటికి పంపలేక పోయాను.... పదిన్నరకి గవర్నరు వస్తారు - ఒక పావుగంట ముందుగా రండి టాజ్ కోరమండల్‌కి' - అన్నారు. 'సెక్యూరిటీ కదా, చేతిలో ఇన్విటేషన్ లేకుండా లోనికి రానిస్తారా?' - అని సందేహం వెలిబుచ్చాను. 'మీ ఇన్విటేషన్ నా దగ్గిర వుందని చెప్పండి ఎడిటర్‌గా మీ విజిటింగ్ కార్డు చూపిస్తే చాలదూ?' - అన్నారు. అదే పని చేశాను. కాన్ఫరెన్స్ హాలులోకి వెళ్లాక శాస్త్రిగారమ్మాయి ఇన్విటేషనూ లంచ్‌కార్డు అందజేసింది. 'భోజనానికి రావడం లేదని మాలతిగారికి చెప్పి రండి - మీటింగ్ అయాక లంచ్ వుంది' అని రాత్రే ఫోనులో చెప్పారు శాస్త్రిగారు. ప్రెస్‌కని కేటాయించిన సీట్ల వరస చూపించారు మిత్రులు డియస్ లింగం.... కాగితాలు టేబుల్ మీద పెట్టి, సీటులో స్థిమితపడి యిటూ అటూ చూస్తూండగా బహుమతి గ్రహీతల పంక్తిలో తెలిసిన ముఖాలు నాలుగైదు కనిపించాయి.... గవర్నరు ఉదయాన శ్రీ పెరుంబుదూర్ వెళ్లి, రాజీవ్ స్మృతి వాటికపై పుష్పమాల వుంచి, అక్కడి కార్యక్రమంలో పాల్గొని వచ్చారనుకుంటాను. అందుకనే కావచ్చు - కొద్దినిముషాలు ఆలస్యమయింది. సాధారణంగా ఆయన అయిదు నిముషాలు ముందే వస్తారు. తమిళనాడు గవర్నరు భీష్మనారాయణ సింగ్ ముఖ్యఅతిథిగా, ఆలిండియా నేషనల్ యూనిటీ కాన్ఫరెన్స్‌వారు (26 యఫ్ - కన్నాట్ ప్లేస్, న్యూఢిల్లీ - 110 001) రాజీవ్‌గాంధీ జన్మదినాన, వివిధరంగాలలో విశిష్ట సేవ చేసిన 32 ప్రముఖులకు హొటల్ తాజ్ కోరమండల్‌లో, 1991 - నేషనల్ యూనిటీ అవార్డ్స్ సమర్పిస్తున్నారు. 1984 లో స్థాపితమైన ఈ సంస్థ నిర్వహిస్తున్న 22వ సమావేశమిది ....తాము అవిశ్రాంతంగా గావిస్తున్న సమైక్యతా కృషి వివరిస్తూ, కార్యదర్శి



1991 ఫిలిమ్ ఫెస్టివల్ విశేష సంచిక బాగుందని ప్రశంసిస్తూ అభినందన లేఖలు వ్రాసిన పాఠక మిత్రులందరకు మా కృతజ్ఞతాంజలి.

తమకొక కాపీ కావాలంటూ కార్డులూ కవరులూ వ్రాసిన వారికి, కాపీలు లేవనీ లభ్యం కావనీ వినయపూర్వకం తెలియజేశాము.

పరిమిత సంఖ్యలో ప్రింటయే పత్రిక ఈ 'జ గ తి' - విడుదలై, పోస్టుకెళ్లాక మా దగ్గిర ఆఫీసు కాపీలు తప్ప ఇంకేమీ మిగలవు. న్యూస్ స్టాండ్స్ ద్వారా అమ్మకం ఏర్పాటు లేదు - అది మాకు ఒకవిధంగా గిట్టుబాటు కూడా కాదు. అందుకనే, ప్రతి నెలా చదవాలనుకొనేవారిని చందాదారులు గమ్మని మనవి చేస్తూంటాము. చందాదారుని ఇంటి గుమ్మంలోకి పోస్టులో వస్తుంది పత్రిక. దేశ విదేశాలలోని పాఠకులకు ఆ విధంగానే అందిస్తున్నాము.

ఫిలిమ్ ఫెస్టివల్ విశేష సంచిక కోసం వ్రాసిన వారికి మా విన్నపం : లోగడ స్త్రీల సంచిక, పిల్లల సంచిక పునర్ముద్రించినట్లే, ఈ విశేష సంచికలోని ముఖ్యాంశాలను, పై నెలవచ్చే సంచికలో పునర్ముద్రిస్తాము. అరవై చిత్రాల సంక్షిప్త సమీక్షలు, ప్రపంచ సినిమా, భారతీయ సినిమా, స్మృత్యంజలి, మిగతావి అను శీర్షికలు పద్దెనిమిది బొమ్మలతో పునర్ముద్రణ పొందుతాయి.

చందా వివరాలు : 24 సంచికలకు రు 50-00 ; జీవిత చందా : రు 300-00 ; పాట్రన్ : రు 1000-00.

JAGATI Monthly, 2, Kutchery Road, P.B. 2922, Madras - 600 004

హర్ భజన్ సింగ్ గంభీర వాక్కుతో చెప్పారు: 'మనదేశ ప్రజలలో ఎందు వల్ల ఈ విచ్ఛిన్న కరధోరణి విజృంభి స్తోంది? హింస, ప్రతిహింసల వల్ల ఏం వొరుగుతుంది ? సహన సౌశీల్యాలతో ఐక్యతా బంధాలను పేనాలి. ఇన్నాళ్లూ పంజాబూ, కాశ్మీరూ, అస్సాముతే ననుకున్నాం. ఇప్పుడు తమిళ నాడుకి కూడా పాకింది అ జాడ్యం. టెర్రరిజమ్ తుదముట్టిస్తే తప్ప మన భద్రత, సమగ్రత సంరక్షింపబడవు' .... నేషనల్ యూనిటీ అవార్డ్ గ్రహీతలు: నవాబ్ జాదా మహమ్మద్ అబ్దుల్ ఆలీ (ఆర్కాట్ ప్రిన్స్ 'హార్మొని ఇండియా'); సినీకళాకారిణి భానుప్రియ; విశాఖపట్నం హిందూస్థాన్ షిప్‌యార్డ్ ఛెయిర్‌మాన్ రేర్ యడ్మిరల్ బింద్రా: విల్సన్ కంపెనీ ఛెయిర్‌మాన్ చంద్రన్; తుమ్‌కూర్ మండల పంచాయత్ ముఖ్యులు ధర్మపాల్; మద్రాసులోని పంజాబ్ అసోసియేషన్ కార్యదర్శి ధవాన్; బన్సీలాల్ ధరిత్‌లహరె (భోపాల్); యన్‌వి హెగ్డె (మంగుళూరు); యస్‌యన్ జైన్ (మద్రాసు); న్యూ కాలేజీ ఛెయిర్‌మాన్ అబ్దుల్ కరీమ్; సోషల్ వర్కర్ మిసెస్ ఉస్మాన్ అలీ ఖాన్; ఛార్టర్డ్ అకవుంటెంట్ యమ్ యస్ కృష్ణన్; ఛీఫ్ ఇంజనీరు ఆరెన్ కృష్ణన్; డాక్యుమెంటరీ ప్రొడ్యూసరు కృష్ణస్వామి; కాంట్రాక్టర్ మణియన్; లాల్‌చంద్ మన్యాల్ (బొంబయి); రిచర్డ్ మాసిలామణి (వెటర్నరీ యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్); ఫిలిమ్ నిర్మాత సుందరలాల్ నహతా; పాస్‌పోర్ట్ ఆఫీసరు నాయర్; ఆర్ రామమూర్తి (వైబ్రామెక్ - ఇంజనీరింగ్); హనుమంతరావు (హైదరాబాదు స్పెషల్ స్కూల్); వి మోహనరావు (మైసూరు ఫెర్టిలైజర్స్); బి నారాణయరెడ్డి (అనంతపూరి యమ్మెల్యే); యస్ సధీక్ (మద్రాసు యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్); కమలా సెల్వరాజ్ (జిజి హాస్పిటల్; టివికెశాస్త్రి (భారత కల్చరల్ ఇంటిగ్రేషన్); అమ్రిక్‌సింగ్ (జిఇసి); నారాయణస్వామి (సివిల్ సప్లయిస్, బెంగుళూరు); దశరధ రామయ్య (హిందుపురం); సురేష్ (షిమొగా). వీరుగాక, పార్లమెంట్ సభ్యులు కె రామ్మూర్తికి స్పెషల్ అవార్డ్; తమిళనాడు ముఖ్యమంత్రి జయలలితకు హింద్‌రతన్ అవార్డ్. చివరి యిద్దరూ, లిస్టులోని ఒకరిద్దరూ తప్ప మిగతా అందరూ స్వయంగా వచ్చి, గవర్నరు గారి వద్దనుంచి 'నేషనల్ యూనిటీ అవార్డులు' అందుకున్నారు. బహుమతి గ్రహీతలందరి గురించీ క్లుప్తంగా వివరణ యిచ్చారు. కార్యక్రమ నిర్వహణ జయాశేఖర్. బహుమతి గ్రహీతలలో కొందరి పేర్లు బహుళ సంఖ్యాకులకు తెలిసినవి, మరి కొందరివి వారి వారి కార్యరంగానికి మాత్రమే పరిమితమైనవి. మొత్తం మీద అందరూ సమైక్యతా లక్ష్యంతో దేశాభ్యుదయానికి కృషి చేస్తున్నవారే!

.... "నేషనల్ యూనిటీ కాన్ఫరెన్స్" రాజీవ్‌గాంధీ జన్మదినాన, యిక్కడ ఈ మద్రాసులో జరగడం ఎంతో

సముచితంగా ఉంది. కులమత సంకుచితాలకు అతీతమైన ప్రజాహిత లక్ష్యంతో ఈ దేశాన్ని ప్రగతి పథాన నడిపింపపూనుకున్న ఆ కార్యశూరుని సేవాతత్పరత భారతి జాతి ఎన్నటికీ మరువలేదు. ఏ ఆశయ లక్ష్యసాధనలో ఆయన అమరుడయాడో, మనం మర్చిపోకూడదు. బ్రిటన్‌లోని భారత హైకమిషనర్ యల్లేమ్ సింగ్వి వ్రాసిన గేయంలోని మాటలివి: సూర్యకాంతితో తళుకు లీనుతున్న శిఖరాగ్రంపై ఎన్ని ఆశాకిరణాలు – భూమి కంపించి లావా ప్రవహించడమా? - ఆశాపుష్పం బూడిద కావడమా? - వసంతాన హృదయ సాగర మధనం, ప్రజానేత్రాన అశ్రువాహినిగా పారింది - విధి నేత్రయుగళిలో ఎందుకా దౌష్ట్యం? - నక్కిదాక్కున్న దొంగ మా పుష్ప కుటీరంలో ప్రవేశించాడు -- సరవిర సుందర స్వప్నాన్ని కొల్లగొట్టాడు - ఈ శిధిలాలనుంచి, ఈ చితాభస్మంనుంచి మా కల మళ్లీ ప్రాణం పోసుకుంటుంది - అతను భూమాతను ఎంతగానో ప్రేమించాడు - ఆ భూమాత అతనిని తన చేతుల్లోకి తీసుకుంది – స్థూల శరీరం పంచ భూతాల్లో కలిసిపోయినా, సూక్ష్మ శరీరం నిరంతర చిరుహాస కాంతులు ప్రసరిస్తూనే వుంది'.... 84 కోట్ల 40 లక్షల జనాభాగల ఈ దేశంలో అనేక మతాలు, అనేక భాషలు, అనేక సంస్కృతులు వున్నాయి. మనదెప్పుడూ

భిన్నత్వంలోని ఏకత్వం – యూనిటీ ఇన్ డైవర్సిటీ, యూనిఫార్మిటీకాదు. ఈ ప్రజల ఆచార వ్యవహారాలు అనాది నుంచి ఏకత్వం వైపు మొగ్గు తున్నాయేగాని నిరంకుశ మార్గాన కాదు. వ్యక్తిని, వ్యక్తి స్వాతంత్ర్యాన్ని ఎప్పుడూ గౌరవించే జాతి మనది. భాషావేశాల కారణంగా రాష్ట్రాలను పునర్ వ్యవస్థీకరించవలసి వచ్చింది. మొదటి టిబెట్‌నుంచి శరణార్థులు, ఆ తర్వాత తూర్పు పాకిస్తాన్ నుంచి, శ్రీలంక నుంచి.... మానవతాన్యాయం తో వారిని ఆదుకోవడం మన ధర్మం అనుకున్నాము.... పంజాబు, అస్సాము, తమిళనాడు దౌర్జన్యవాదులకు ఆట పట్టయాయి. భాష, ప్రాంతము, మతము - యిలాటివన్నీ మరచి ఒకే మాటగా ముందుకి సాగాము గనుకనే మనకు స్వాతంత్ర్యం సిద్ధించింది. ఆ ఐక్యతా లక్ష్యం ఆ సుధీర సంకల్పం ఏమయాయి ? వాటిని మేల్కొల్పడం ద్వారానే మనం ముందడుగు వేయ గలుగుతాము. అదే మన తక్షణ కర్తవ్యం," - అన్నారు తమిళనాడు గవర్నరు భీష్మనారాయణ సింగ్. నవాబ్‌జాదా మహమ్మద్ అబ్దుల్ ఆలీ (ఆర్కాట్ ప్రిన్స్) వందన సమర్పణ గావించారు.... యూనిటీ అవార్డ్ గ్రహీ తలకు, కొందరు ఆహూతులకు లంచ్. విందు భోజనంలో గవర్నరు కూడా పాల్గొన్నారు.... ఇప్పటికి 22 సమా వేశాలు జరిపి, ప్రజలలో ఈ ఐక్యతా భావం గట్టిగా నాటేందుకు హర్‌భజన్ సింగ్ (ఆలిండియా నేషనల్ యూనిటీ కాన్ఫరెన్స్ కార్యదర్శి) గావిస్తున్న అవిరళ కృషి అభినందనీయం.

. . . . .28

మ్యూజిక్ అకాడమీలో, ఇండి యన్ కౌన్సిల్ ఫర్ కల్చరల్ రిలే షన్స్ మద్రాసులోని యలైయన్స్ ఫ్రాంకె (Indian Council for Cultural Relations and Alliance Francaise De Madras) సంయు క్తంగా ఏర్పాటు చేశారు. ఫ్రెంచి సాంస్కృతిక ప్రదర్శన గ్రాండర్ (Grandur) స్టేజిమీద ఒక విశాల మైన పొరుగుల టేబుల్ ఉంటుంది. ఒక స్త్రీ, ఇరువురు పురుషులూ రక రకాల మూకాభినయంతో, మధ్య మధ్య కొద్దిగా మాటలతో వివిధానేక వింతచేష్టలతో ప్రేక్షకులని నవ్వి స్తారు. ఇందులో పెద్దగా కథ అంటూ ఏమీ లేదు ; చెప్పుకోదగ్గ నాటకీయతా లేదు. కాని, రంగస్థలం మీదవున్న ముగ్గురూ దృశ్య ప్రధానమగు ప్రక్రియతో హాస్యపు జల్లులు కురి పిస్తారు (Visual Theatre). భిన్నత. ప్రత్యేకత గల ప్రదర్శన.

. . . . .31

శేఖర్ బ్రదర్స్‌లోని చి॥ గుణశేఖర్‌కి (యాక్టర్ రాజశేఖర్ బ్రదర్) సౌ॥ శ్రీదేవికి (గణేశ్ కుమార్తె 'శంకర్-గణేష్) ఈ సాయింత్రం విజయాశేష్ మహల్‌లో వెడ్డింగ్ రిసెప్షన్. జగన్ రిసీవ్ చేసుకు, నన్ను నరుసుని ('వనిత'), 'గోల్డ్‌స్టార్' ఎడిటర్‌ని

ప్రెస్‌కని కేటాయించిన వింగ్‌లో కూచోబెట్టారు గాని లేకపోతే ఆ జన వాహినిలో అంతా వుక్కిరి బిక్కిరిగా ఉంది. ఇళయరాజా మ్యూజిక్. ఫిలిమ్ నిర్మాత గుణశేఖర్ విద్యాధికుడు, వినయ వర్తనుడు. నవదంపతులకు మా శుభాకాంక్షలు.

## సెప్టెంబరు 01, 1991

సూర్యామూవీస్ (ఎయమ్ రత్నం) నిర్మిస్తున్న 'ఆశయం' చిత్రానికి, ఈ ఉదయం పదకొండున్నరవేళ ఎవియమ్ స్టుడియోస్‌లో మేనకాగాంధీ, యిందుకోసమని ప్రత్యేకంగా వచ్చి క్లాప్ యివ్వడం, ఒక ఘన విశేషం. నిర్మాతకు, దర్శకునికి (మోహన్ గాంధీ) విజయశాంతికి యిది విజయ సూచక చిహ్నం. మేనకాగాంధీ క్లాప్ యివ్వగా, ఎవియమ్ శరవణన్ కెమెరా స్విచాన్ చేశారు. పూజాదికాలయాక ప్రెస్ కాన్ఫరెన్స్.... తలి దండ్రులు తమ సంతానం లాయరో, డాక్టరో, ఇంజనీరో అవాలనుకుంటారుగాని రాజకీయాలలోకి రావాలని సామాన్యంగా ఎవరూ అనుకోరు. ఎంచేతనంటే, రాజకీయాలలోని కలుషిత వాతావరణమే కారణం కావచ్చు. ఈ చిత్రంలోని తండ్రి తన కుమార్తెను 'పొలిటకల్ సైన్స్' తీసుకోమంటాడు. కాలుష్యంతో పోరాటం జరిపి, రాజకీయాల పట్ల వుండే దురభిప్రాయాన్ని పోగొట్టేందుకు ప్రయత్నం చేస్తుంది కథానాయిక.... విజయశాంతిబాటు జగపతిబాబు, విజయకుమార్, పరుచూరి వెంకటేశ్వరరావు, నిర్మల, సాధన, సునంద మున్నగువారున్నారు. పరుచూరి బ్రదర్స్ కథ, ప్రసాద్‌బాబు కెమెరా, రాజ్‌కోటి సంగీతం. సమర్పణ: విజయశాంతి ... 'స్త్రీకి 'పొలిటికల్‌సైన్సు' ఎందుకు ? - అని అభ్యంతరం తెలుపుతూ, దుర్గాబాయి గారికి బెనారస్ విశ్వవిద్యాలయం



## సినిమా పేరు ?

**ఏరువాకమ్మా మా కెదురు రావమ్మా**
**ఎదుదొచ్చి ఎడతెగని సిరులిచ్చి పోవమ్మా**

*గేయరచన : ఆత్రేయ.... పాడినవారు : సుశీల, బాలూపార్టీ*

ఆ పాట ఏ చిత్రంలోనిది ? సరిగా చెప్పగలిగిన మొదటి యిరువురికీ పదేసి రూపాయలు బహుమతి. ఎక్కువ మంది చెప్పగలిగినప్పుడు, చీట్లు వేసి. మొదటి యిరువురికే బహుమతి ఇవ్వడం జరుగుతుంది.

మీ జవాబు కార్డుమీదనే వ్రాయండి : చివరి తేది : 20-10-1991



సీటు యివ్వకపోతే, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో రాధాకృష్ణన్ సీటు యిచ్చారనీ, స్వాతంత్ర్య పోరాటంలో, రాజ్యాంగ శాసనసభ మెంబరుగా, సెంట్రల్ సోషల్ వెల్‌ఫేర్ బోర్డు ఛెయిర్‌మాన్‌గా, ఆంధ్ర మహిళాసభ స్థాపకురాలిగా ఆమె జీవితంలోని సంచలనాత్మక ఘట్టాలు కొన్ని మీ నాయిక పాత్రకు ఉపకరిస్తాయేమో చూడండి - కల్పనకు వాస్తవికత తళుకునిస్తుంది' - అని దర్శకులు మోహన్‌గాంధీకి సూచించాను, నేతి సీతాదేవి వ్రాసిన జీవితకథ డాక్టర్ దేశముఖ్ వ్రాసిన స్వీయ కథ - రెండూ చదివితే చాలునని కూడా చెప్పాను. నాకు తెలిసినది చెప్పాను. 'కర్తవ్యం' మాదిరి ఈ 'ఆశయం' ఒక విలక్షణ చిత్రంగా రూపొందవచ్చు. పిఆర్ఒ : జగన్.

. . . . . 06

"ఇండియన్ బాంక్ ఛెయిర్‌మాన్ గోపాలకృష్ణన్, వారి తండ్రిగారి కాలంనుంచీ మాకుటుంబానికి ఎంతో సన్నిహితులు. ఆయన ఫాదరూ మా ఫాదరూ సమ వయస్కులు, పరస్పర గౌరవాభిమానాలు గల ఆప్తమిత్రులు సామాన్య ఉద్యోగిగా ఇండియన్ బాంక్‌లో చేరి, స్వయం కృషితో అత్యున్నత స్థాన మందుకోవడం గోపాలకృష్ణన్‌లోని ప్రతిభకు, పట్టుదలకు, ప్రజ్ఞాధురీణతకు తార్కాణం; నెలకు పది పన్నెండు రోజులు టూర్. ప్రతిసాయింత్రం రెండు మీటింగులు; మద్రాసు దూరదర్శినిలో అందరి కంటె ఎక్కువగా కనిపించే వ్యక్తి అవడం వల్ల ఆయన 'టివి' గోపాలకృష్ణన్ అయిపోయారు. ఈ సభకు అధ్యక్షత వహించేందుకు ఆయన అంగీకరించడం మాకెంతో సంతోషంగా ఉంది" - అన్నారు ఎమ్ ఎ ఎమ్ రామస్వామి (ప్రొ-ఛాన్సలర్ అన్నామలై యూనివర్సిటీ), రాణీ సీ త య్ హాలులో, కుమారరాజా ముత్తయ చెట్టియార్ 63 వ జన్మదిన సందర్భంగా, చెట్టినాడ్ గ్రూప్ స్టాఫ్ రిక్రియేషన్ క్లబ్‌వారు ఏర్పాటు చేసిన సభలో, ఆహూతులకు స్వాగతం చెబుతూ! ఆ తర్వాత అధ్యక్షులు గోపాలకృష్ణన్, తమ కుటుంబాల మధ్యగల మైత్రీబంధంచెప్పి, నలభైకే నూరేళ్లూ నిండిన కుమార్ రాజా ముత్తయ్ చెట్టియార్ విశిష్ట వ్యక్తిత్వం వివరించారు. "ఇరవై రెండేళ్లు గడిచినప్పటికీ ఆయన గురించిన జ్ఞాపకం చెరగనిది; ఆయన పరిధిలోకివచ్చిన ఏ ఒక్కరూ ఆ మూర్తిలోని స్నేహ సౌహార్ద్రతలనీ, సౌజన్యాన్నీ, ఔదార్యాన్నీ, గుణవిశేషాలనీ మరువలేరు. అంతటి ఐశ్వర్యంలో ఆ నిరాడంబరత ప్రత్యక్షంగా చూసినవారుగాని నమ్మలేరు. బాకింగూ, రేసింగూ, సంగీత సాహిత్యాదులు, లలిత కళలు, అత్యున్నత స్థానంలో వున్నవారిని అతి సామాన్యులని సమబుద్ధితో చూడగల ఉదారచింతన, మనో వైశాల్యం - యిలాటివి వంశానుక్రమంగా వచ్చినవీ,

స్వయంగా పెంపొందింపుకున్నవీను. 24వ ఏట ఆయన ఇండియన్ బాంకుకి ప్రధాన డైరక్టరయారు; నన్ను ఈ బాంకులోకి తీసుకున్నది కుమారరాజాయే. మా నాన్నగారు, సర్‌రాజా ముత్తయ చెట్టియార్ పచ్చ య్యప్పాస్ ట్రస్ట్ బోర్డులో వుండేవారు. ట్రస్టీలుగా అనేక విషయాలు చర్చించు కోవలసి వచ్చేది. అన్నామలై యూని వర్సిటీ స్థాపననుంచి నేటిదాకా 'చెట్టి నాడు కుటుంబం' తమిళనాడు ప్రజా హితరంగంలో - కళలు, సాహిత్యం, ఆలయాలు, ధర్మకార్యాలు, విద్యావ కాశాలు, పరిశ్రమలు - ఒకటేమిటి, అన్నిటా యితోధికంగా సేవచేస్తూ, సాటిలేని మేటి కుటుంబంగా వన్నె తెచ్చుకుంది. తండ్రిగారు, సోదరుడూ వేసిన బాటను మరింత శోభాయ మానం చేస్తున్నారు రామస్వామి" – అన్నారు గోపాలకృష్ణన్.... "నీవు సంతోషంగా ఉంటూ, పొరుగువారిని సంతోషంగా వుండనీయ్' అనే తత్త్వాన్ని జీవితంలో అనువదించిన మహోన్నత వ్యక్తి కుమారరాజా ముత్తయ్ చెట్టియార్. ఆయన బహు ముఖ ప్రతిభావంతులు. గుర్రాల



## 'జగతి' చందా కూపను

2, కచేరి రోడ్డు - పి.బి. 2922

మైలాపూరు- మద్రాసు-600 004

ఈ నెల నుంచి 24 సంచికలు పంపగోరుతూ రు. 50/-కు (ఏభై) బాంకు డ్రాఫ్టు లేదా పోస్టల్ ఆర్డరు లేదా మనియార్డరు రసీదు ఇందుతో జత పరిచినాను.

పేరు ..........................................................

అడ్రసు ..........................................................

..........................................................

..........................................................

తేదీ : సంతకం

JAGATI - 2, Kutchery Road, P.B. 2922, Mylapore, Madras-600 004



గురించి ఎంత క్షుణ్ణంగా తెలుసో వ్యాపార సూత్రాలుకూడా అంత గాఢంగా తెలుసు. విద్యా ప్రమాణాలు, లలితకళలు, సాహితీ సంస్కృతులు - వీటన్నిటి పట్లా ఆయనకు ఎంతో మక్కువా అనురాగమూను. ఏ పదవి ద్వారా ఎక్కువ మందికి ఉపయోగ పడవచ్చో, అటువంటివి మాత్రమే ఆయన చేబట్టేవారు. అంత ఐశ్వర్య వంతులైనా పదవీకాంక్ష ఆయనకు ఏ మాత్రం లేదు. ఆ మహానుభావుడు తెరమరుగుకి వెళ్లి అప్పుడే ఇరవై రెండేళ్లు అయిపోయిందా ? - అనిపిస్తోంది" - అన్నారు అన్నామలై యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ టిసి మోహన్ .... మాపోసిని (శివజ్ఞాన గ్రామణి), గోపాలరెడ్డి గారిని ప్రసంగాలు చేసిన ముగ్గురూ ప్రత్యేకంగా పేర్కొన్నారు. లిఫ్టులో కిందకి వస్తున్నప్పుడు గోపాలరెడ్డి గారు 'నా కిప్పుడు 84 - మీ వయసెంత ?' అని అడిగారు 'మాపోసి'ని. '86' - అన్నారాయన.

..... 07

బాలారావు, ఐయమ్ రావు దంపతుల కుమారుడు చి॥ రఘుకి (మెరైన్ ఇంజనీరు) బెంగుళూరు వాస్తవ్యులు ఎ రామకృష్ణమూర్తి దంపతుల కుమార్తె సౌ॥ ప్రశాంతికి, వివాహం జరిగిన సందర్భంగా, 'పామ్‌గ్రోవ్' లో వెడ్డింగ్ రిసెప్షన్. పసరికలో కుర్చీల మీద మ్యూజిక్ ఆలకిస్తూ, పాత మిత్రులతో కబుర్లు; ఆ తర్వాత భోజనం. సముద్ర యానంతో నవ జీవనం ప్రారంభించే కొత్త దంపతులకు మా శుభాకాంక్షలు.... 'సముద్రాల మీద' అనగానే జోసఫ్ కాన్రాడ్, స్టీఫెన్ క్రేన్ వంటి సాహితీకారులు గుర్తుకొస్తారు.

—యన్నార్ చందూర్







# చిత్రజగతి సమీక్ష





సాయి మాధవి వారి

## 'ప్రేమ తపస్సు'

ఈ చిత్రంలో రెండు జంటలు చివరంటా ప్రేమ తపోధనులై వుంటారు. చిన్నప్పట్నుంచీ జత కట్టిన ముత్తాలు, రత్తయ్యని (రాజేంద్ర ప్రసాద్) కావ్య సుమ బాలికలా, కడపటి కతను కళ్ల పోగొట్టుకొనే ధాకా ప్రేమించి, అతని కంటి చూపై, వెంట నడుస్తూ, దారి చూబుతుంది. తన్న మెడలో తాళి వుంటేగాని మగ వాళ్ల ఆకలి చూపుల నుంచి రక్షణ లేదని నమ్మకం కలిగిన తర్వాత, ఒక చల్లటి రాత్రివేళ తన వొంపు సొంపులతో, అంద చందాలతో, వలపు వయ్యారాలతో ఎంత కిందా మీదా పడి దొర్లినా, భయస్థుడూ వెర్రిబాగులవాడూ అయిన రత్తయ్య లో చలనం కలగదు. ఈమె కాముక చర్యలన్నీ వృథా అవుతాయి. కాని, ముత్తాలులో రత్తయ్య పట్లగల అభిమానం, తన వాడిని కాపాడుకోవాలనే పట్టుదల మాత్రం, దేహ లాలసకు అతీతమైనవి. ఈమెని ఆదుకునేందుకు బైరాగి తాత వుంటాడు; రత్తయ్యకి డబ్బులిచ్చి గుప్పెట్లో పెట్టుకు, ఏ నాటికైనా ముత్తాలుని పొందాలని కాచుకు నుంటాడు విలన్ శివంగి మామ.... నాలుగిళ్లలో పాచిపని చేసుకు పూరి పాకలో బతికే పేద పడుచు. ముత్తాలైతే, కాలేజీలో చదువుకుంటూ, ప్రేమాయణంలో పడి, ప్రేమే జీవిత సర్వస్వంగా భావించి, రహస్య సంకేత స్థలానికి ప్రియుని రాక పది నిముషాలు ఆలస్యమైతే, ముంజేత గాటు పెట్టుకు రక్తం చిందించడం ద్వారా, తనని తాను హింసించుకొనే, స్వభావం సుజాతది. మేనమామ కిచ్చి పెళ్లి చేదామనుకుంటుంది తల్లి. కాని, ఈమె సాగర్‌ని (సాయికుమార్) ప్రేమించింది. ఒక చిన్న ప్రమాదంలో అతని ముఖం కాలి, అపకారం ఏర్పడగా, సుజాత తల తిప్పేసుకుంటుంది. అతను ప్రేమ భిక్ష కోసం వేడుకుంటాడు. ముత్తాలులోని ఔదార్యం స్వయంగా చూసిన మీదట ఈమెకు వివేకోదయమవుతుంది.... రాజేంద్ర ప్రసాద్ నటనా వైదుష్యంతో ప్రేక్షకులని ఆకట్టుకోవాలని తీసిన చిత్రమని అనిపిస్తుంది; గ్రాడ్యుయేట్ బిచ్చగాళ్లు, అడుక్కొనే వాళ్లని తయారు చేసే టీచర్, రైస్ మిల్ వోనరు - యిదంతా అతకని కృతక హాస్యం.... సమర్పణ: విజయలక్ష్మి; దర్శకత్వం: శివప్రసాద్; నిర్మాత: వేణుగోపాల్.... పిఆర్ఓ: పసుపులేటి రామారావు.

సీరియల్

# మధు స్వప్న శాఖ

## పూజిత

గడిచిన కథ : సివిల్ ఇంజనీరు విశాలకు, డాక్టరు నాగార్జునకు పెళ్లి నిశ్చయమయింది- ఒకరి మీదొకరికి ఎంతో అభిమానం. లావణ్య కేవలం పేషంటు మాత్రమే. విశాల సోదరి విమ్మి, దుర్మార్గుడైన రాజేష్ తో, బీరువాలోని నగలన్నిటితోను పరారి కావడం, కొత్త సమస్యలు తెచ్చిపెడుతుంది. అదలా వుండగా, విశాల నెవరో ఎత్తుకు పోతారు విమ్మి బంధ విముక్తురాలవుతుంది .... (ఇక చదవండి

ప్రేమగా విమ్మిని లేవనెత్తి బుజాల పై చేతులు చుట్టి చెప్పింది - "విమలా .... ఈ అనుభవంతో జీవితంలో చాలా తెలుసుకున్నావనే అనుకుంటాను. అతను రాకముందే వెళ్ళు ఇక్కడ నుండి.... జాగ్రత్త.... వాళ్ళ కంట పడకుండా మీ వాళ్ళను కలుసుకో...."

"మీ పేరు.... తెలుసుకోవాలని వుంది."

"నా పేరా? నిర్భాగ్యుల సమస్యలకు పరిష్కారం.... చూపించాలని తాపత్రయ పడే 'వనితా సదన్' సురేఖను...."

"మిమ్మల్ని కలుసుకోవటం.... నా అదృష్టం...." అంది కన్నీళ్ళతో చేతులు జోడించి.

విమ్మి లోపలకెళ్ళి నగల సూట్ కేస్‌తో, బయటికి వచ్చింది. 'మిమ్మల్ని తరువాత కలుసుకుంటాను' అని ఆమె అడ్రసు తీసుకుని వెళ్ళిపోయింది విమ్మి.

**54**

"ఏయ్ ఎవరు నువ్వు.... ఎందు కొచ్చావు.... ఎక్కడికెళుతున్నావ్...." వెనుకనుండి గుర్ఖా అరుస్తున్నా విని పించుకోకుండ రయ్‌మని లోపలకు పరుగెత్తింది విమ్మి.

"...... నన్ను రక్షించండి ... ఆంటీ.... నన్ను కాపాడండి.... ఆంటీ!" రాజేశ్వరిని పొదవి పట్టుకుంది విమ్మి.

"ఏమయింది విమ్మి.... ఏమి జరిగింది. ఇలా వణికిపోతున్నావ్.... ?"

"ఆ రాజేష్ మనుషులు నన్ను వెంబడిస్తున్నారు.... తరిమేయండి, ఆంటీ,.... ఇక్కడ ఎవరూ లేరని చెప్పండి."

గుర్ఖాకు చెప్పింది రాజేశ్వరి.... "వాళ్ళు ఎవరైనా వస్తే.... ఇక్కడకు ఎవరూ రాలేదని పంపించేయ్.... వెళ్ళు, వాళ్ళని.... లోపలకు రానివ్వకు."

గుర్ఖా గేటు దగరకు వెళ్ళేసరికి ఇద్దరు వ్యక్తులు వచ్చి "ఒకామె ఇక్కడకు వచ్చింది. ఆమె మా మనిషి...." అన్నారు.

గుర్ఖా వారిని తరిమి పంపించేశాడు.

.. నేను.... చాలా పొరపాటు చేశాను.... ముందు విశాలను రక్షించుకోవాలి" - ఏడుస్తూ చెప్పింది విమ్మి.

"విశాలనా.... ఆమెకేమయింది ?"

"నాకు వివరాలన్ని సరిగా తెలియవు.... రాజేష్ ఆమెకు ఏదో ఆపద కలిగిస్తున్నాడని మాత్రం లీలగా తెలుసు...."

"అంకుల్ యింట్లో లేరు. నాగార్జున, చందన మీ ఇంటికే వెళ్ళారు. మరి కారులో కనపడి చెప్పింది.... నీవేనా.... ?"

"కా రు లో నా.... నేనా.... ఏమని.... ?"

"చందనా.... నేను ఆపదలో వున్నాను - పోలీస్ కంప్లయింట్ ఇవ్వమని"

"నేను కాదు, ఆంటీ, విశాలేమో !"

నిశ్చేష్టురాలైన రాజేశ్వరికి ఏం చేయడానికీ తోచలేదు.

## 55

"రెండురోజులనుండి తిండి పెట్టక పోయినా నీవు దారికి రాలేదు నీవెంత అసాధ్యురాలివే.... ఇప్పటికైనా మించిపోయిందిలేదు... రాసివ్వు...." అంది.

"నా బొందిలో ప్రాణముండగా రాసివ్వను"

"ఎంత పొగరే నీకు...." వికారంగా నవ్వాడు శేషాద్రి....

శేషాద్రి చేతిలోని బెల్టు, విలాసంగా తిరిగి, శమ్మి వంటిని చర్రున తాకుతుంది.

బాధకి తట్టుకోలేక "ఏమని వ్రాయమంటారు....?" - అని అడిగింది.

"నాచావుకి కారణం ఎవరూకాదు .... నాకు జీవితమంటే విరక్తి కలిగి ఆత్మహత్య చేసుకుంటున్నాను" - అని వ్రాసివ్వాలి.

"అలా రాసిచ్చినా.... చంపేస్తారు ....రాసివ్వకుంటే ఏమిచేస్తారు... ?" శమ్మి అంత ధైర్యంగా అడుగుతుంటే వెంటనే సమాధానం దొరక్క వెతుక్కోవలసి వచ్చింది వాళ్ళిద్దరి పరిస్థితి.

"మేము చేసే చిత్రవధకు తట్టుకోలేవు" బెదిరించాడు శేషాద్రి.

"నన్ను చిత్రవధ చేసి మీరిద్దరూ ఉరికంబం ఎక్కుతారు"

"అలాగనా ?' అంటూ శమ్మి జుట్టుపట్టుకుంది అత్తగారు. శమ్మి విసురుగా నెట్టటంతో ఆమె క్రింద పడిపోయింది.

"మా అమ్మ మీదనే చేయి చేసుకుంటావా....?"

"మీరు ముందు కొచ్చారా నా చేతిలో ఏముందో చూడండి" - అని కత్తిపీట చూపించింది శేషాద్రికి.

56

"ఇంత జరుగుతూంటే మాకెందుకు తెలియచేయలేదు....?" అని అడిగాడు నాగార్జున, సూర్యారావుని.

తలవంచుకున్నారా దంపతు లిద్దరు. కారాగిన చప్పుడికి విశాలే వచ్చి వుంటుందని గబ గబ బయటకు వచ్చారు.

రాజేశ్వరి.... కారులోనుండి దిగింది.

స్పృహ తప్పివున్న విమ్మిని లోపలకు.... తీసుకు వచ్చారు. జరిగినదంతా.... రాజేశ్వరి చెప్పింది.

ఈ రెండు రోజుల్లో ప్రమీల చాలా నీరసించి పోయింది.

రాజేశ్వరి ఆమె దగ్గరగా వచ్చి.... "ఇంత జరిగినా.... మాకెందుకు చెప్ప లేదు....?" అంది నిష్ఠూరంగా.

రాజేశ్వరి రెండు చేతులు తన చేతుల్లోకి తీసుకుని, భోరున ఏడ్చేసింది ప్రమీల.

"జరిగిందేదో జరిగి పోయింది.... ప్రస్తుతం జరగవల్సింది చూడాలి. విశాల విషయం ఏమిచేద్దాం....?" నాగార్జున్ని అడిగింది.

"చందనా.... కారులో నీకు కనిపించిన వ్యక్తి విశాల కాదు గదా ?" సందేహాన్ని వెలిబుచ్చాడు నాగార్జున.

అందరికి ఆ అనుమానమే కలిగింది.

విమ్మిముఖం మీద నీళ్ళు చల్లారు. కొద్ది సేపటికి ఆమె కళ్ళు తెరచింది. గ్లూకోస్ నీళ్ళు స్పూనుతో నోటిలో పోసింది చందన.

తల్లిని పట్టుకుని బోరున ఏడ్చింది విమ్మి. ప్రమీలా సూర్యారావులని

## మనవి

మీరు విన్నవీ మీ అనుభవంలో వున్నవీ పదిమందికి చెబితే బావుంటా యనుకొనే 'జోక్స్', నిమ్మతొనలు శీర్షికలో ప్రచురింపబడతాయి. ఈ పత్రికకు సంబంధించిన సూచనలకు, విమర్శలకు 'పాఠకుల తీర్పు'. ఈ పత్రికలో వెలువడేవన్నీ మా అంతట మేము కోరి వ్రాయించేవి - అంచేత, ప్రచురణ నిమిత్తం వ్యాసాలూ, కథలూ, కవితలూ పంపవద్దు. ఎప్పుడైనా అవసరమైతే, మేమే అడుగుతాము. చందా 24 సంచికలకు : ఏభై రూపాయిలు.

JAGATI - 2, Kutchery Road, P.B. 2922, Mylapore, Madras-600 004

అప్పుడే అక్కడకు వచ్చిన రాజశేఖరం శాంతింపచేసేడు.

"నలుగురికి తెలియకూడదని, ముఖ్యంగా మగపెళ్ళివారికి తెలియకూడదని మాలో మేమే కృంగిపోయాం....." అని విలపిస్తున్న ప్రమీల....సూర్యారావులకి.... 'మగపెళ్ళివారు, ఆడపెళ్ళివారు కాదు, మనిషికి తోటి మనిషి ఓదార్పు ముఖ్యం....' అని చెప్పాడు రాజశేఖరం.

నాగార్జున పోలీస్ స్టేషన్‌కు ఫోన్ చేయగా, యస్.ఐ. విషయాన్ని వివరంగా నోట్ చేసుకున్నాడు.

నాగార్జున తన కారులో బయలుదేరాడు - విశాల జాడ తెలుసుకునేందుకు.

విమ్మి..... చందన.... ఇద్దరు - పోలీసు సాయంతో శమ్మి వాళ్ళ అత్తవారింటికి వెళ్ళారు.

ప్రమీల, రాజేశ్వరి వడిలో తల పెట్టుకుని రోదిస్తోంది.

## 57

నాగార్జున మనసంతా.... విశాల చుట్టే తిరుగుతోంది. ఈ మనుషుల్లో వున్న క్రూరత్వం ఆమెను బలితీసుకుంటుందా....? ఆమెకు ఏ ఆపదా కలగకుండా కాపాడుకోవాలి.... ఆమెను ఎక్కడికి తీసికెళ్ళివుంటారు? ఎప్పటికి ఆమె జాడ తెలుస్తుంది. దారులు వెతుక్కుతున్నాడు; ఆమె వుండగల స్థలాలు అంచనా వేస్తున్నాడు. రోడ్డు నిర్మానుష్యంగా వుంది .ఈదురు గాలికి మనసు పరి పరి విధాల పోతున్నది.

చందన.... విమ్మి, శమ్మి వాళ్ళ ఇంటికి చేరుకున్నారు. తలుపుకు పెద్ద తాళం వేసివుంది. ఆ తాళం చూస్తే విమ్మి కెందుకో అనుమానం కలిగింది. ఒక వేళ శమ్మీని లోపలేగాని బంధించి వున్నారేమో!

"అవును.... అలా జరిగి వుండవచ్చు..." అంది సాలోచనగా చందన.

ఇంటి చుట్టూ తిరిగారు.... లోపల ఎక్కడో రూమ్‌లో లైటు వెలుగుతున్నట్టుంది - అలికిడి వినిపిస్తున్నది.

పోలీసులు తాళం పగలగొట్టి లోన ప్రవేశించారు. అనుకోని పరిణామానికి బిత్తరపోయి వెర్రికేక పెట్టింది రుద్రమ్మ. శేషాద్రి కూడ అక్కడకు వచ్చాడు.... ఆందోళనగా....

తాళం పగలగొట్టి, తల్లీ కొడుకులని అరెస్టుచేసి కట్లతో వున్న శమ్మిని విడిపించారు.

సోదాచేయగా.,... వాళ్ళ దగ్గర కలకత్తాకు రెండు ట్రయిన్ టికెట్స్ దొరికాయి. శమ్మిని చంపి అక్కడ వొదిలేసి, వాళ్ళిద్దరూ పారిపోయేందుకు ప్లాన్ వేసుకున్నారు.

"నన్ను పేపరు మీద రాసివ్వమన్నారు - నాకు నేనే ఆత్మహత్య చేసుకుంటున్నానని! అలా వ్రాసివ్వక పోయేసరికి, నన్నెలాగో అలా అంతం చేసి, పారిపోయే ఈ ప్లాను వేసుకున్నారు" అని చెప్పింది విమ్మి.



# RAJA-LAKSHMI AWARD 1991

Dr. 'Nataraja' Ramakrishna, wellknown exponent of Temple Dance of Andhra Pradesh has been chosen by SRI RAJALAKSHMI FOUNDATION for its RAJALAKSHMI AWARD for the year 1991. The Award consisting of Rs. 50,000/- and a Citation will be presented to him at a function on November 19, 1991. In his capacity as rescipient of this Award, Sri. Ramakrishna will be invited to the United States, by the Telugu Fine Arts Society, New Jersey, U.S.A., to receive "Dr. K. V. Rao and Dr. Jyothi Rao Award" of US $ 2,000/- and another US $ 500/- from Dr. & Mrs. Chalapathi Rao Somayajula of Colorado Springs. He will also receive US $ 500/- from Dr. & Mrs. Sarma Modali of Washington through Greater Washington Telugu Society.

The RAJALAKSHMI LITERARY AWARD for 1991 goes to eminent Telugu Poet Dr. Boyi Bhimanna. The Award consisting of Rs. 10,000/- and a Citation will be presented to him on November 19, at a function.

The recipient of this award will also be receiving another Award of Rs. 10,000/- instituted by Dr. M. D. N. Rao of U. S. A. named after his parents Sri Mithinti Adinarayana and Smt. Mithinti Annapoornamma as "MAN-MAP AWARD" along with RAJALAKSHMI LITERARY AWARD.

  

## 58

స్పీడుగా వెళుతున్న కారుని అందుకోవాలని మహా స్పీడుగా పోనిస్తున్నాడు తన కారుని నాగార్జున. అతి సమీపంలో వున్న ఆ క్రీమ్ కలర్ కారు.... వేగంగా పోయి.... చెట్టుకు తగిలి, వెనక్కు వచ్చి - నాగార్జున కారుని ఢీ కొట్టి, మళ్ళీ స్పీడుగా వెళ్ళి కనుమరుగైపోయింది. పోలీసువ్యాను కూడ అటు వచ్చింది. ముందు వెళ్ళిన కారులో విశాలను తీసుకెళుతున్నారని నాగార్జున చెప్పాడు. వ్యాను.... నాగార్జున కారు.... విశాలను తీసుకెళుతున్న కారుని వెంబడించాయి.

స్పీడుగా వెళుతున్న ఆ కారు ఓ పెద్ద బండకు తగిలి ఆగిపోయింది. డ్రైవరు అక్కడే మరణించాడు. ఒకతనికి బాగా దెబ్బలు తగిలాయి. విశాలకు కూడ దెబ్బలు తగిలాయి. రాజేష్, ఇంకో వ్యక్తి తప్పించుకు పారిపోయారు.

నాగార్జున వచ్చి చూశాడు. విశాల అలాగే సీటు మీదకు ఒరిగిపోయి వుంది. వెంటనే హ స్పి టి ల్ కు చేర్చారు. సీరియస్ కేసని డాక్టర్లు చాలా హడావుడి పడుతున్నారు.

## 59

నాగార్జున కోసం ఎదురుచూస్తూ వుంది లావణ్య రాత్రి పది గంటలయినా.... ఆమె ఎదురు చూడటం మానలేదు. ఆ రోజు అన్ని విషయాలు వివరంగా చెప్పాలనుకుంది. మర్నాడేదో ఊరుకెళ్ళాలన్నాడు. ఎంతకీ నాగార్జున రాకపోయేసరికి ఆమెకు అనూహ్యమైన నిస్పృహ కలిగి, ఆ రాత్రి గడవడమే కష్టమనిపించింది.

హాస్పటిల్‌కు ఫోన్ చేసింది. రాలేదన్నారు. వాళ్ళనడిగి ఇంటి ఫోన్ నెంబర్ తెలుసుకుంది. అక్కడకు చేస్తే ఇంట్లో ఎవరూ లేనట్లు చెప్పాడు నౌకరు. ఎన్నిసార్లు చేసినా లేరని.... ఎక్కడికెళ్ళిందీ తెలియదని చెప్పాడు.

"అలా కూర్చున్నావేమ్మా! డాక్టరు గారు రాలేదా?" అడిగాడు తండ్రి.

"వస్తానన్నారు రాలేదు...."

"రేపు వస్తారులే" అని నచ్చ చెప్పాడు.

కాని, ఆ సమాదానం ఆమెకు తృప్తి కలిగించలేదు.

మళ్ళీ ఇంటికి రింగ్ చేసింది. లావణ్య గొంతు విని తల బాదుకున్నాడు నౌకరు. ఈ మహా తల్లి ఎవరోగాని నా ప్రాణం తోడేస్తోంది. అనుకుని, 'మేడమ్ డాక్టరుగారు లేరండి'.... అని చెప్పాడు.

"ఇంకా రాలేదా .... ఇంట్లో ఎవరూ లేరా....?"

"ఎవరూ లేరమ్మా"

"మళ్ళీ, వెంటనే ఫోన్ రింగయింది. హలో మేడమ్ చెప్పాను కదమ్మా! ఎక్కడికెళ్ళారో తెలియదని"

"ఇడియట్".... ఆ గంబీరమైన స్వరం విని, కంగారుగా "బాబుగారండీ ఎవరో ఒకమ్మ. చిన్నబాబుగారు వున్నారా అని పన్నెండు సార్లు ఫోన్ చేసింది...."

"సరేలే ఎవరైందీ తెలుసుకుని, వాళ్ళు ఎక్కడున్నదీ చెప్పి, ఇల్లు జాగ్రత్త - అని పెద్దమ్మగారికి చెప్పు" అన్నాడు రాజశేఖరం.

ఈసారి లావణ్య ఫోన్ చేసినప్పుడు, నాగార్జున ఎక్కడున్నదీ చెప్పాడు నౌకరు. రఫీమని ఫోన్ పెట్టేసి .... బయలుదేర బోతున్న లావణ్యను ప్రశ్నించాడు శ్రీనివాసరావు "ఎక్కడికమ్మా" అని

"డాడీ అరంటుగా హాస్పటిల్‌కు

"హాస్పటిల్‌కా ? ఎందుకు.... ?"

"డాక్టరు నాగార్జునని వెంటనే కలుసుకోవాలి"

"ఎందుకమ్మా తొందర ? ఆయన వస్తారుగా"

"ప్లీజ్ డాడీ.... త్వరగా, వచ్చేస్తాను"

తను వెళ్లడం ఆయనకు ఇష్టం లేదని తెలుసు, కాని లావణ్య ఆగదు. నాగార్జునని చూడనిదే తనకు నెమ్మది లేదు....

ఆసుపత్రి ముందు కారాగింది. డ్రైవరు తలుపు తెరచాడు. నాగార్జున ఏ వార్డులో వున్నాడో ?

ఎదురుగా వస్తున్న లేడి డాక్టరుని

"డాక్టర్ నాగార్జునా...." అంది ఆలోచనగా....

"అవును"

"సైకియాట్రిస్ట్ కదా ?"

"అవును"

"ఎవరో పేషంట్‌ని అడ్మిట్ చేశారు.... వార్డ్ నెంబరు ఫోర్.... నేరుగా వెళ్లి లెఫ్టటర్న్.

థ్యాంక్స్ చెప్పి.... లావణ్య వెళ్ళింది వార్డ్ నెంబరు ఫోర్‌కి.

అక్కడున్న వ్యక్తు లెవరూ తెలియదు. ఆమె వునికిని ఎవరూ పట్టించుకోలేదు. అప్పుడే రూమ్‌లో నుండి వచ్చిన చందన లావణ్యని చూసి, "ఎవరి కోసం ?" అని పలకరించింది.

"డాక్టర్ నాగార్జున...."

"రండి లోపలకి...."

మంచం మీద పడుకున్న పేషంట్‌గాని, దుఃఖభారంతో ఆ మంచం చుట్టూ నిలుచున్న మనుషులు గాని, ఆ పేషంటుకి యిస్తున్న ఆక్సిజన్ గాక, ఎక్కిస్తున్న సెలైన్ గాని, ఏమీ లావణ్య కంటికి ఆనలేదు. నాగార్జున మాత్రమే ఆమె కళ్ళల్లో నిలబాడు. తనతో రోజూ సరదాగా కబుర్లుచెప్పే డాక్టర్ నాగార్జున ఇంత నీరసించి వున్నాడేమిటి ఒక్క రోజులో ఎంత మార్పు ? ఇంతకృంగ తీసిన ఆ పేషంట్ ఎవరు ?

"అన్నయ్యా...." చందన పిలుపుతో తలెత్తి చూశాడు నాగార్జున. చందన ప్రక్కనే నిలబడి వున్న లావణ్య కనిపించింది.

"అన్నయ్యా.... ఎవరీమె.... ?"

"మిస్ లావణ్యా.... మై పేషంట్."

"ఈమె నా సిస్టర్.... చందన" అని పరిచయం చేశాడు.

"ఆ పేషంట్ నా డియరెస్ట్ ఫ్రెండ్" అని చెప్పింది చందన. లిప్తపాటు ఆవేదన తొణికిసలాడింది.

అక్కడి వాతావరణాన్ని చూచిన లావణ్యకు ఇంటికి తిరిగి వెళ్ళాలనిపించలేదు. అక్కడే కాసేపు వుండి మౌన దృక్కులతో ఎంతో సానుభూతి నాగార్జునకు వ్యక్తబరుస్తూ వినయంగా నమస్కరించి సెలవు తీసుకుంది. ఆ వాతావరణం యావత్తు మమతల పందిరిలా కనిపించిందామెకు.

## 60

మరునటిరోజు విశాలకు స్పృహ వచ్చింది. అయోమయంగా వుంది. తనెక్కడ వుంది ? తనకేమయింది ? నెమ్మదిగా అంతా అర్థం అయింది. తను ఆఫీసులో వుంటే, ఎవరో ఒక తను వచ్చి, మీనాన్నగారికి సీరియస్‌గా వుందని చెప్పటం, తను హడావుడిగా రావడం, దరిదాపులోనే వున్న టాక్సీ ఎక్కటం, ఆ టాక్సీ కొండల వెంట పరుగెత్తటం, అది వెనక వస్తున్న కారుని తప్పించుకోబోయి

యాక్సిడెంట్ అవటం.... గుర్తుకొచ్చి .... ఆమె శరీరం కంపించి పోయింది.

"విశాల దగ్గరగా వచ్చి ఎలా వుందమ్మా ?" - తల మీద ప్రేమగా నిమురుతూ అడిగింది ప్రమీల.

విశాల నుదుట ప్రేమగా ముద్దు పెట్టుకుంది రాజేశ్వరి. విమ్మి, శమ్మి తప్పు చేసిన వాళ్ళలా తలవంచి కాళ్ళ దగ్గర మంచం కమ్మీ పట్టుకు నిలుచున్నారు. "విశాలకు స్పృహ వచ్చింది గా, డోంట్ వరీ" అని ఓదార్పుగా సూర్యారావు బుజంమీద తట్టాడు రాజశేఖరం.

నాగార్జున కళ్ల నిండుగా ఆరాధన. అందర్నీ పరిశీలనగా చూస్తున్న విశాల దృష్టి క్షణంపై లావణ్య నిలిచింది.

లావణ్య.... విశాల దగ్గరగా వచ్చి .... ఆమె చేతిని తన చేతిలోకి తీసుకొని, కరచాలనం చేసి... "మీ ఫామ్లిలో నేను క్రొత్తగా.... కనిపిస్తున్నాను కదూ! నా పేరు లావణ్య.... డాక్టర్‌గారి కోసం వచ్చాను. మిమ్మల్ని చూశాక వెళ్ళాలనిపించలేదు. అందుకే వుండిపోయాను" - అంది స్నేహపూర్వకంగా నవ్వుతూ.

బత్తాయి రసంలో గ్లూకోస్ కలిపి తెచ్చింది చందన - స్పూన్‌తో నోటిలో పోసింది విశాల వద్దంటున్నా.

నర్సు వచ్చింది, "ఆమెను ఎక్కువ మాట్లాడించకూడదు.... బాగా రెస్ట్ తీసుకోనివ్వండి. డాక్టర్‌గారు వస్తున్నారు. మీరెవ్వరూ వుండకూడదు

## నెపోలియన్

తమ పని అయిపోయాక ఎంతటి వారూ చేసేది జ్ఞాపకాలు రాయడమే.

ఈ ప్రపంచం ఆరు రోజులలో సృష్టింపబడిందనే విషయం మరువక, పరుగు అందుకోండి.

ఏ గంటకేమి జరుగనున్నదో విధాయకంగా జరిగితీరుతుంది. ఎంతటి ఘనుడూ కూడా తన కాల పరిమితిని ఒక్కక్షణం పొడిగించుకోలేడు. సర్వం కాలానికి కట్టుబడవలసిందే.

యూరప్‌లో శాంతిని నెలకొల్పేందుకు నెపోలియన్ చక్రవర్తి అడ్డుతగులుతున్నాడని విరోధులు అంటున్నారు. అదే నిజమైతే ఈ సింహాసనం దిగేందుకు, ఈదేశం వొదిలేందుకు, ఆఖరికి ప్రాణాలు సైతం అర్పించేందుకు సంసిద్ధంగా వున్నాను.

ఈ దేహం ఒక కడియారం వంటిదే; అది ఎంత కాలం తిరిగేదీ ముందే నిర్ణయమైపోయివుంటుంది. ఈ గడియారం తయారు చేసిన వాడైనాసరే, దీనిని తెరిచి రిపేరు చేదామనుకున్నాడా, పూర్తిగా చెడగొడతాడు.

.... బయటకి వెళ్ళండి, పేషంటుని చూడాలి," అని చెప్పింది. ఆమె చెప్పినట్టుగానే అందరూ బయటకు వచ్చారు.

డాక్టరు, విశాల పాదాల మీదున్న బెడ్‌షీట్ తొలగించి.... 'నీ-హేమర్'తో పాదం అడుగు భాగం మెల్లగా గీస్తూ "ఏమనిపిస్తోందమ్మా, స్పర్శ తెలుస్తోందా ?" అనడిగాడు.

విశాల లేదన్నట్లు తలూపింది.

"గట్టిగా గిల్లి.... ఇప్పుడేమయినా తెలుస్తోందా.... ?"

లేదని తల పంకించింది.

తొలగించిన బెడ్‌షీట్ సర్దాడు, నాగార్జున ఎగ్జయిటెడ్‌గా చూస్తున్నాడు.

"నా కాళ్ళకు ఏమయింది.... ?" అని అడిగింది విశాల.

"ఏమీ కాలేదమ్మా ! రొటీన్ చెకింగ్...."

నాగార్జునకు అర్ధమయినట్లుంది. డాక్టర్ వెనుకే వెళ్ళాడు.

## 61

డాక్టర్ చెప్పినదంతా వినిన నాగార్జున నుదురంతా స్వేదంతో తడిసిపోయింది. హంస నడకలతో నాట్యం చేసే విశాల, సివిల్ ఇంజనీరు విశాల, హొయలూ, అందాలూ విరజిమ్మే విశాల ఇప్పట్లో నడవలేదా.... ? ఎందుకీ పరీక్ష ? మంచితనమే తప్ప కల్మషమెరుగని ఆ ఉత్తమురాలుకి నడవలేని దైన్య స్థితికి వచ్చిందా.... మరో నాలుగు రోజుల్లో పెళ్లిపీటల మీద కూచోనున్న తరుణిపై విధాత కెందుకీ కక్ష ? దేవుని దేముంది ఇందులో - చుట్టూ మనుషులు తీసే గోతులుగాని.

నిస్సహాయంగా విశాలను చూస్తూ తను ఎలా బ్రతకగలడు ? ఈ వ్యధను భరించడమెలా ? రెండు చేతులతో ముఖాన్ని కప్పుకున్న నాగార్జునని వోదారుస్తూ " 'రిలాక్స్' అవండి. అధైర్యపడవద్దు. మంచి ట్రీట్‌మెంట్ ఇస్తే బాగయిపోవచ్చు. మెడిసిన్ ఎంత డెవలప్ అయిందో మీకు తెలియదా ?' అన్నాడు ఆ ఫిజీషియన్.

## 62

ముగ్గురు కూతుళ్ల భవిష్యత్తు ఇలా అయిపోయిందన ప్రమీల, సూర్యారావు కుమిలిపోయారు. నెలరోజులుగా ట్రీట్‌మెంట్ జరుగుతున్నప్పటికీ, ఏమాత్రం మార్పులేదు. నాగార్జున రోజూ విశాల దగ్గరకు వచ్చి.... ఆమెతో కాసేపు కబుర్లు చెప్పి వెళ్ళేవాడు. వీలయినంతవరకు ఆమెను సంతోషంగా వుంచాలని అతని సంకల్పం. విశాల త్వరగా కోలుకుని నడుస్తుందనే అందరూ అనుకుంటున్నారు. విశాల కారణంగా లావణ్య విషయం కనుక్కోలేక పోతున్నాడు.

నాగార్జున రాకకోసం, అతని స్నేహం కోసం.... అతని అనురాగం కోసం ఎదురు చూస్తున్న లావణ్య బాలా చిక్కిపోయింది. నాగార్జున,

విశాల కాబోయే భార్యాభర్తలా ?.... ఆ తలపు ఆమెని మరింత నీరసపరు స్తోంది.

విశాలను డిశ్చార్జి చేశారు. ఆమె ఆరోగ్యం ఫరవాలేదు. గాని, నడక రాలేదు. ట్రీట్‌మెంట్ జరుగుతూనే వుంది. చందన, నాగార్జున రోజూ వచ్చి చూసి వెళుతున్నారు. చందన వివాహం కూడా ఆగిపోయింది. విశాల 'వీల్ చేర్'లో తిరుగుతుంటే చూసే వారికి భారంగా వుండేది.

"ఇలా జరిగిందని దిగులుగా కూర్చుంటే బరువుగా వుంటాయి రోజులు. జరిగిందేదో జరిగిపోయింది. జరగబోయేది మీకందరికీ సమ్మత మైతే చేస్తాం.... ఎలాగో మనకి టైమ్ .... పాస్ కావాలి. అందుకని ముగ్గురం కలసి ఒక చిన్న స్కూల్ పెడదాం - చేతినిండా పని వుంటే, కష్టాన్ని మరచిపోయేందుకు అవకాశం దొరికినట్టవుతుంది.... మమ్మి డాడీని ఒప్పించి.... ఏర్పాట్లు చేద్దాం...." అంది విశాల.

భవిషత్తు పట్ల ఆమెకు గల విశ్వా సానికి తల్లిదండ్రుల కళ్ళు చెమ ర్చాయి.

స్కూల్ ఓపెన్ చేశారు. ఆ ఓపె నింగ్‌కి లావణ్య కూడ వచ్చింది. ఆమెను చూచి అందరూ ఆశ్చర్య పోయారు. లావణ్య చిక్కి శల్యమై నట్టుంది. దేనికోసమో వ్యధ చెందు తోందని గ్రహించిన విశాల, "మీరు ఏదో బాధ పడుతున్నట్టున్నారు. నేనే మైనా.... హెల్ప్ చేయగలనా.... చెప్పండి...." అంది విశాల.

"ఏదో నలత.... దానంతటదే సరుకుంటుంది. మీవంటి.... మంచి స్నేహితులవల్ల.... చిన్న.... చిన్న కష్టాలు అట్టే తొలగిపోతాయి" అంది లావణ్య నవ్వుతూ.

లావణ్య వెళ్ళేముందు చెప్పింది విశాల.... "మీకు తీరిక [illegible] మా స్కూల్‌కు వచ్చి, మాకు సాయ పడవచ్చు, విద్యాదానాన్ని మించిన అదృష్టం లేదు ఈ లోకంలో."

అందరూ వెళ్ళిపోయాక చాలా రాత్రి వరకు ముగ్గురు అక్క చెల్లెళ్ళు.... మాట్లాడుకుంటూ కూర్చు న్నారు. వాళ్ళను చూచిన ఆ తల్లి దండ్రుల మనసుకు వూరట కలిగింది. చాలా కాలం తరువాత అందరూ ఆనందంగా ఉన్నారు.

విశాలకు బాగయి పోతుందని మూడు నెలలు పాటు చూశారు. కాని ఆమెకు నయంకాక పోవటంతో చందన పెళ్ళి తప్పనిసరిగా ఏర్పాటు చేయవల్సి వచ్చింది. రెండు పెళ్ళిళ్ళు ఒకసారి జరగాలని ఆశించినందుకు నిరుత్సాహం కలిగినా విశాలనే కోడలిగా స్వీకరించాలనే కోరికను రాజే శ్వరి తుడిచివేసుకోలేదు. "విశాలా.... నీకు త్వరగా బాగయి పోతుందమ్మా ! అప్పుడు నిన్ను కలహంస నడకలతో లక్ష్మిదేవిలా మా ఇంటికి తీసుకు పోవాలనే నా కోరిక తప్పక తీరు తుంది" - అంది రాజేశ్వరి విశాలను ప్రేమగా చూస్తూ.

ఆమె వాత్సల్యానికి విశాల కళ్ళు చెమర్చాయి.

"నీవు నిజంగా నా బిడ్డపాలిట దేవతవు, రాజేశ్వరీ. వాత్సల్యాన్ని చూపిస్తున్నావు" అంది ప్రమీల జీరపోయిన గొంతుతో.

'ప్రమీలా, విశాలమీద ప్రేమతో నాగార్జున ఎంత అప్ సెట్ అవుతున్నాడో తెలుసా! నాకు భగవంతుడి మీద నమ్మకముంది. విశాలకు త్వరలోనే బాగయిపోయి, మనందరం సుఖంగా ఉంటాం" అంది రాజేశ్వరి.

"విశాలా.... నిన్ను వదలి పెళ్ళి చేసుకుని వెళ్ళాలంటే నా మనసు అంగీకరించటంలేదు. అయితే వాళ్ళు తొందర చేస్తుంటే, మమ్మీ వాళ్ళు కాదనలేక పోయారు."

"చందూ.... అలా వర్రీ కావద్దు - నాకేమిటి? ఇందరి ఆత్మీయుల మధ్య వున్నాను. స్కూల్ పెట్టినప్పటి నుండి బిజీ అయిపోయి, కాలమే మరచి పోతున్నాం. ఈ పిల్లల కేరింతలలో, జరిగిన దుస్సంఘటనల గురించిన ధ్యాసే లేదు. నా గురించి ఫీల్ కావద్దు. నిశ్చింతగా వుండు. కనీసం.... నీ.... వివాహమయినా చూచి అందర్నీ తృప్తిపడనియ్...." అంది విశాల.

చందన పెళ్ళి ఏర్పాట్లు జరుగుతున్నవి.

✠ ✠ ✠

"ఆంటీ.... మీకు నేను ఏమీకాక పోవచ్చు కాని, మీకు హెల్ప్‌గా వుంటే అభ్యంతరమా?" అనడిగిన లావణ్య వైపు ఆత్మీయంగా చూస్తూ, "....ఎవరమ్మా నీవు మా పై ఇంత అభిమానం దేనికి?" అని అడిగింది రాజేశ్వరి.

"నేను చిన్న వయసులోనే అమ్మను పోగొట్టుకున్న అభాగ్యురాలిని, ఆంటీ .... మీరు జరిగినదానికి 'వర్రీ' కావద్దు.... జరిగేకాలం మనతో రాజీ పడదు.... జరగబోయే కాలంతో మనం రాజీ పడి నడవగలగాలి"

"నిన్ను ఎక్కడో చూసినట్లు గుర్తు" - సాలోచనగా అడిగింది రాజేశ్వరి.

"అవునాంటీ, విశాల హాస్పటల్లో

"ఆఁ.... అవును" అని లావణ్య వైపు చూసింది రాజేశ్వరి. గులాబీ రేకుల్లాంటి లావణ్య పల్చటి పెదవులు చిన్నగా విచ్చుకున్నాయి. అందమైన ఆ నయనాలు క్రింద నల్లటి చారలేమిటి? వత్తుగా వున్న బుగ్గలు పల్చబడిపోయి, శంఖులాంటి కంఠం సాగి, మనిషి చిక్కినట్లు కనిపిస్తూంది.

"అప్పుడు నేను చూచినప్పుడు నిండుగా వున్నావు.... ఇలా చిక్కి పోయావేమిటి .... ఆరోగ్యం బాగలేదా....?"

"ఆరోగ్యానికి కేమి.... బాగానే వుందాంటీ.... కానీ...." - అని ఏదో చెప్పబోయి ఆగిపోయింది.

"పేరేమిటమ్మా....?"

"లావణ్య...."

"లావణ్య....పేరుకు తగినట్టే పుత్తడిబొమ్మలా వున్నావు.... అయితే ఎవరికోసమో దిగులు పెట్టుకున్నావ్....?"

"అదేం లేదు.... అంతా ఇమాజినేషన్.... చిన్న వయసులో శ్రీరాముడు ఆకాశంలో వున్న చందమామ కావాలని అల్లరి చేశాడు. అద్దంలో చూపించి మభ్యపెడతారు. చిన్న వయసులో గనక తృప్తిపడిపోతాడు. అదే లోకజ్ఞానం తెలిసిన పెద్దవాళ్ళయిన తరువాత, చందమామ కావాలని కోరితే ఎవరు తెచ్చి ఇవ్వగలరు....? ఎలా సాధ్యం....? ఇలా కొన్ని ఇమాజినేషన్‌లో ఊపిరి పోసుకుంటాయి."

లావణ్య మాటలు రాజేశ్వరికి అర్థమయీ అర్థం కాకుండా ఉన్నాయి కానీ, ఆ అమ్మాయి మాట చాతుర్యం రాజేశ్వరిని ఆకట్టుకుంది.

"లావణ్యా, నీవు చాలా అర్థవంతంగా మాట్లాడతావమ్మా: ఎంత దాక చదువుకున్నావు....?"

"ఎం. ఎస్. సి"

నాగార్జున అటుగా వచ్చాడు తమ ఇంట్లో లావణ్యను చూచి.... లిప్తపాటు అయోమయంలో పడిపోయి.... వెంటనే సర్దుకుని "హలో".... అన్నాడు పలకరింపుగా.

'నాగార్జునా,... ఈ అమ్మాయి తెలుసా....?'

"ఆ, మమ్మీ....షి.... ఈమె నా పేషంట్...."

ఆ మాట వినిన లావణ్య ముఖం కొంచెం చిన్నపోయింది.

అలాంటి పరిచయం ఆమెకు 'ససేమిరా ఇష్టంలేనట్లుంది, పాపం.... అనుకున్నాడు మనసులో.... "చందూ ....ఈమె వీణ బాగా వాయిస్తారు" అని చెప్పాడు మెప్పుగా....

"అలాగా.... అయితే ఆమె వీణా నాదం వినవలసిందే".... అంది చందన.

లావణ్య ముఖంలో కాస్తంత రిలీఫ్ కనిపించి, తృప్తిగా నిట్టూర్చింది.

'అసలీమె ఇక్కడి కెందుకు వచ్చింది....?' - అనుకున్నాడు నాగార్జున.

"వీణ వినిపించాలంటే వీణ పట్టుకు రావాలి కదా!" అంది లావణ్య.

"మీరు సరే అంటే, మా డ్రయివర్ని పంపుతాను" - అంది చందన.

"ఈ సారి వచ్చినప్పుడు నేనే తీసుకువస్తాను."

రాజేశ్వరి ఆ అమ్మాయి భుజం మీద ప్రేమగా నొక్కి 'అప్పుడప్పుడు వచ్చి వెళుతూండు' అని చెప్పింది.

ఆ ఆహ్వానం మలయ పవనంలా హృదయాన్ని స్పందించగా చిరునవ్వుతో "అలాగేనండి" అని చేతులు జోడించి నమస్కరించి, శెలవు తీసుకుంది లావణ్య.

"మంచి అమ్మాయి"
రాజేశ్వరి.

చందన సన్నగా నవ్వుకుంది.

నాగార్జునకు ఉక్కిరి బిక్కిరిగా వుంది. లావణ్య తన పేషంట్.... ఇలా ఇంటి మీద దాడిచేస్తే ఎటువంటి చిక్కులొస్తాయో....

## 63

ఇచ్చిన మాట ప్రకారమే లావణ్య వీణ పట్టుకొచ్చింది. అయితే తను పాడుతుంటే నాగార్జున వినాలని ఆమె అభిలాష.... అతను ఇంట్లో వున్నదీ లేనిదీ ఆమెకు తెలియదు.

'పాడమ్మా!' – రాజేశ్వరి చెప్పింది.

"ఎన్ని జన్మల అనుబంధమో.... ఇది....

నేను మరువలేను

నీకు తెలుపగలేను...."

వీణ మీటుతూ ఆమె రాగయుక్తంగా పాడుతుంటే వినసొంపుగా వుంది.

తన రూమ్‌లో కూర్చుని ఆలోచనా నిమగ్నుడైన నాగర్జున, ఆ మధుర మంజులగానం విని, అప్రయత్నంగా లేచి వచ్చి, గుమ్మానికి ఆనుకుని, లావణ్య వైపు చూస్తూ తమకంగా వింటున్నాడు.

పాట పాడుతూ అతన్ని గమనించిన లావణ్య స్వరంలో తీపిదనం ఇంకొంచెం హెచ్చయింది.

పాట పూర్తయింది. చందన, రాజేశ్వరి చాలా మెచ్చుకున్నారు.

'లావణ్యా, చాలా బాగా పాడావు' అని నాగార్జున అంటాడని ఆశించిన ఆమెకు నిరాశే మిగిలింది అతనేదో కలలో లేచి వచ్చి వినేసి వెళ్ళినట్లుగా వెళ్ళిపోతుంటే....

"అన్నయ్యా పాట విన్నావా ?" - అని చందన అడిగింది.

"విన్నాను.... చాలా బాగుంది" అన్నాడు. నిజానికి అతను విన్నదీపాట కాదు. ఆ పాటలోని మీనింగూ - సైకియాట్రిస్ట్‌గా ఆ మాటలలోని నిగూఢార్థం. ఆమె ఏ వుద్దేశంతో ఆ భావ ప్రసూనాలు పాటలో రంగరించిందో యోచనా ముద్రతో విన్నాడు. ఆమే బాగా పాడగలదు - అది కాదు కావలసింది. ఆ చక్కటి గానంలోని అభూత కల్పనల వెనుకనున్న దేమిటి ?.... సైంటిఫిక్‌గా కనుక్కొని పేషంటుని దారిలోపెట్టడమే తన ధర్మం.

## 64

"చందూ.... నెనెలా రాగలను ? ప్లీజ్, నన్ను వొదిలెయ్ - నా అభినందనలు ఇక్కడ నుండే అందుతాయి. వివాహమంతా వి.సి.ఆర్.లో చూస్తానుగా."

"అదెలా విశాలా, నీవుగాని ఆ కళ్యాణమంటపం దగ్గర లేకుంటే, నేను వివాహాన్నే మానేసుకుంటాను. ఎలాగైనా నీవు వచ్చితీరాలి".... అంది చందన మొండిగా.

(ఇంకా వుంది

JAGATI Telugu Mouthly - Vol. 36 No 423 -Oct 91

Edited, Printed and Published by N.R. Chendur at
MANASA PRESS 2 Kutchery Road Madras 600 004
Phone 76697